# శ్రీమతి అరుణ

ఆగస్టు విప్లవంలో అంతర్ధానమై - మూడున్నర సం వత్సరాల అజ్ఞాత వాసానంతరం - బహిరంగ రాజ కీయ ప్రపంచానికి ఆగమించింది అరుణ -

ఆమె ఆగమనంతో-విప్లవ భారత రాజకీయాంబరాన అరుణోదయ మయినది——

స్వతంత్రభారత సమరాంగణం విజయారుణ రేఖా లంకృతమైనది——

నవభారత వీరనారీలోకంలో నవ్యశక్తులు సమీకృత ములవుతున్నవి——

యువ[illegible] ఇంకా మ[illegible] భావుకులకు అరుణరాక - ఒక [illegible] పట్టణ సరిస[illegible] !!!

భారతనారీశక్తిని వర్ణిస్తూ స్వర్గీయ లోకమాన్య బాలగంగాధర తిలక్ మహరాజ్ అన్నాడు——

" ......కవి జన్మిస్తాడుగాని, తయారుకాడు- అని ఆర్యోక్తి. అట్లే త్యాగికూడా జన్మిస్తాడుగాని తయారౌనర్ప బడడు. ఇదేసూత్రం శౌర్య, ధైర్య, వీరత్వాది విశేషగుణా లకుకూడా వర్తిస్తుంది. తరతరాలనుండి, యుగయుగాల

నుండి మానవజీవితాన్ని లోతుగా తరిచి చూచినగాని ఈ సత్యం ద్యోతకంకాదు....భారతావనీ ఈ నాడు పారతంత్ర్య మైవుండవచ్చు. కాని - అజన్మసిద్ధులైన శౌర్య, ధైర్య, సద్గుణాలంకారులగు ధీరసంతానాన్ని ఆమె ప్రభవిస్తూనే వున్నది. అది ఆ తల్లి కడుపు. చలవ. మరి, ఆమెకొమార్తె లగు భారతనారీ లోకానికి ఈ ప్రత్యేక సద్గుణ సంపత్తి లేకుండా ఎలావుంటుంది? వీరమాతలు, వీరపత్నులు— ఈ నాడు భారతస్వాతంత్ర్య సమరరంగంలో విద్యుల్లత వలె మెరుస్తూవుండడం చూస్తూవుంటే—ఆ ప్రత్యేకత, ఆఘనత, ఆ కీర్తి భారత భూమికే తగిపోయింది, పౌరాణిక యుగంలోని సత్యభామాది పూతచరిత్రులమాట అటుంచండి- ఇటీవలి చరిత్రలో ఝాన్సీరాణి లక్ష్మీబాయి మన కండ్ల ముందు మెరిసిపోయింది, ఆమె కత్తితళతళలు - మన దృష్టిపథాన ధగధగాయమానంగా మెరిసిపోతున్నవి. మహా

టుంది- అని పల్లెప్రజలు చెబుతూవుంటారు నేటికిని) కాని ఈ నాటి మన స్వాతంత్ర్య సమరంలో ఎంతమంది ఝాన్సీ రాణులు, మరెంతమంది అహల్యాబాయిలు జన్మించినారో చూడండి ! సమీక్షించండి ! ఉత్తేజితులుకండి ! భారతనారి రక్తంలోనే వున్నది విప్లవశక్తి!...."

"మహరటా" పత్రికలో లోకమాన్యుడు వ్రాసిన

ధ్వనించినవి, నిద్రిత భారత మహిళాలోకం చైతన్యవంత మయింది.

ఈశతాబ్ది మొదటి దశాబ్దిలో, తిలక్ మహరాజ్ భారత జాతీయవిప్లవోద్యమం ఫాలభాగాన రక్తతిలకందిద్ది నాడు, వీరభారత నారీలోకం ఆ విప్లవ శక్తికి వీరహారతుల నెత్తింది.

సరోజనీ - విజయలక్ష్మి - కమలాదేవి - శ్రీమతులు ఆవిర్భవించారు। భారతస్వాతంత్ర్య సమరతలాన వీరనాయకురాండ్రు ఐ-యువతీ లోకానికి సారధ్యం వహిస్తున్నారు.

ఈ మూర్తిత్రయా..కి - నాల్గవ మూర్తివలె నేడు 'అరుణ' చేరుకున్నది, నవభారత యువలోకానికి నవ్య మార్గం చూపించి - నవ్యోత్తేజంతో నవ్యపధాన నడిపింప నున్నది,

అరుణ — ఈనాటి యువనాయకమణి.

నిన్నటి స్థయిర్యాన్ని, నేటిధైర్యాన్ని మిళాయించి— రేపటి శౌర్యంగా రూపొందించగల అపూర్వ ప్రజ్ఞాయుత యువనాయకత్వం ఈనాడు మనకు కావాలి ! అవస్యము కావాలి ! !

అరుణ - ఈస్థానాన్ని - అలంకరిస్తుందా ? ? ?



భారత భూమిలో వంగభూమి అగ్రగామి,

ఇతర రాష్ట్రాలకు మకుటాయ మానమై - ఆభూమి గురుపీఠాన్ని అలంకరిస్తున్నది. పాడిపంటలకు వంగ దేశము కామధేనువు, కల్పతరువూను. హైందవమత, విజ్ఞానాలు ఆ నాట పరిణతిగన్నవి.విద్యావైదుష్యాలలో, సాంఘిక చైతన్యములో, కళాసంస్కృతులలో స్వయంప్రతిభ ఐ. స్వయం ప్రకాశమానమై వెలుగొందుతున్నది వంగ దేశము. ఆధునిక యుగంలో - అందులోను, బ్రిటిష్ పరిపాలనా చరిత్రలో వంగదేశానికి ఒక ప్రత్యేకస్థానమున్నది. కళా విజ్ఞాన వృత్తాలలో ఆచార్యపీఠ మలంకరించినట్లే - వంగ రాష్ట్రం ఆధునిక రాజకీయరంగంలో కూడా ప్రధాన పాత్ర వహించి యావద్భారత దేశానికి మార్గదర్శి అవుతున్నది.

"బ్రిటిష్ సామ్రాజ్యనీతి వంగభూమిలో తినినటువంటి తీవ్రాఘాతాలు మరెక్కడను రుచిచూచి వుండలేదు. అందుచేతనే లార్డుకర్జన్ రాజప్రతినిధి ఉద్యోగమునుండి విరమించిన పిమ్మట - లండన్‌లో - నూతనంగా వైస్రాయి పదవికిగాను భారతదేశానికి వెడలబోతూవున్న ఒక ఆంగ్ల మిత్రునితో...."బాబు అనే పేరు ఎప్పుడైనా విన్నావా? బెంగాలీబాబు! జాగ్రత్త! ఓకన్ను బెంగాల్ పైన - రెండవ కన్ను మిగిలిన భారతదేశంపైన వుంచి - మరీప్రవర్తించు. నీకు జయమవుతుంది...." అని హితవిచ్చి పంపినాడని ఒక ప్రతీతి.

స్వాతంత్ర్య పిపాసకు, ఆత్మాభిమానానికి, జాతీయ గౌరవానికి - వంగదేశానికి పెట్టినది పేరు - రవీంద్ర కవి

చంద్రుడు, అరవింద ఘోష్, చిత్తరంజన్ దాస్, అషుతోష్ ముఖర్జీ, ఆచార్యప్రఫుల్ల చంద్ర రే, జగధీష్ చంద్రబోసు, బాబు సుభాస్‌చంద్ర బోస్, మొదలగు మేరునగధీరులను కన్న పవిత్రభూమి వంగభూమి.

ఈ ఇరువదియవ శతాబ్ది ఆరంభం నాటికి - వంగ క్షేత్రంలో ప్రశిద్ధిగన్న - ముఖర్జీ, బెనర్జీ వంశాలవలె "గంగూలీ" వంశంఒకటి - భారత సంస్కరణోద్యమానికి తొలి కోడి యనదగిన రాజారామ్‌మోహన్ రాయ్‌కి కుడిభుజమై కృషిచేసిన దేవేంద్రనాథ గంగూలీతో - "గంగూలీ" వంశం ఆధునిక వంగదేశ చరిత్రలో చోటుచేసుకొన్నది.

హిందూమతాచారాలకు శిరోభూషణం అని పేరెన్నికగని-సాంఘిక సంస్కరణలలో ముందంజవేసి మార్గదర్శియై దేశసేవకు, ప్రజాసేవకు అంకితమై ప్రజాహృదయపూజ లందుకొన్న - ఆ గంగూలీ వంశంలో తిరిగి ఈ ఇరువదవ శతాబ్ది ఆరంభంలో మరియొక కమలం జనించింది. అరుణ కాంతులతో ప్రభవించింది అరుణ—

వంగదేశములో ప్రఖ్యాతవిద్యావేత్తయై, విద్యావ్యాపకానికి విశేషకృషియొనర్చి పేరుమిగిలిన శ్రీ ద్వారక్‌నాథ్ గంగూలీ - ఇటీవలి "గంగూలీ" వంశచరిత్రలో మిక్కిలి ప్రశిద్ధుడు. ద్వారక్‌నాథ్ గంగూలీ తనయ శ్రీమతి గంగాబాయి గంగూలీ - వంగదేశంలో మొట్ట మొదట "యం.బి" పట్టాన్ని సంపాదించిన మహిళామణి. జాతీయ కాంగ్రెసు మహోద్యమాలలో ఈమెసముచితమైన పాత్రను నిర్వహించి కీర్తిగన్నది. ధీవిశేష సంపన్నులను, దేశహితైక

జీవనులను ప్రసాదించి, 'గంగూలీ' వంశం ఆధునిక వంగ దేశ చరిత్రలో అద్వితీయ స్థానాన్ని అలంకరిస్తున్నది.

అరుణతండ్రి అట్టి "గంగూలీ"వంశసంజాతుడు. తల్లి "టాగూర్" వంశస్థురాలు, గంగాయమునల సంగమానంతరం 'సరస్వతి'వలె - ఆదంపతులకు "అరుణ" జ్యేష్ట పుత్రికగా 1910 సంవత్సరంలో జన్మించింది.

అరుణ తండ్రి ప్రసిద్ధిగన్నవ్యాపారస్తుడు. ఢిల్లీ నగరంలోను, లాహోర్ పట్టణంలోను, నైనిటాల్ నగరంలోను, అతనికి పెద్ద పెద్ద "హోటళ్లు" ఉన్నవి. ప్రభుత్వోద్యోగులు, ధనస్వాములు, కులీనులు ఆ హోటళ్ళలో భోజన వసతుల నేర్పరుచుకొంటూ వుండడంవల్ల వాటికి ఉన్నత తరగతికి చెందిన విశ్రాంతి గృహాలుగా పేరువచ్చింది. "హోటల్" వ్యాపారమేగాక - ఇతర వ్యవహారములలో కూడా అతడు బాగా ధనాన్ని ఆర్జించినాడు.

వృత్తి ఏ మైనప్పటికిని అతడు భారతీయాచార పరాయణుడు, ఆంగ్ల, వంగభాషలలో చక్కని ప్రవేశం కలవాడు. వంగభాషలో ఒక పాటిగా పండితుడు అతడు. "గంగూలి" వంశజులు బ్రహ్మసమాజ మతావలంబులు కనుక - అతని ఇంట పాత, కొత్తఆచారాలు సమ్మేళనము, ఒక వినూత్న సద్గోష్ఠి వికాసిస్తూవుండేవి. అరుణ తల్లికూడా సాంప్రదాయ ప్రశిద్ధమైన వంశంలో జన్మించటంచే ఆమె ఛాందసురాలు కాకపోయినా, శిష్టాచారమూర్తి.

వ్యాపారస్తుడు, వ్యవహారదక్షుడు, ధనవంతుడు కనుక - అరుణ తండ్రికి పెద్ద పెద్ద ఉద్యోగులతో పరిచ

యంవుండేది. జమీందార్లతోను, ధనస్వాములతోను సహవాసం వుండటంతో - అతడు ఎంతటి ఆచార నియమాలు కలవాడైనను - ఒకింత పాశ్చాత్య పద్ధతులకు, వ్యవహారాలకు అలింబనీయుడు కాకతప్పలేదు.

వ్యాపార వ్యవహారాలను బట్టి అతడు తరుచు డిల్లీ, లాహోర్, నైనిటాల్ నగరాలు మూడింటియందు కూడా కాపురముంటూవుండేవాడు. అరుణ బాల్యంఅంతా లాహోర్ నగరంలోనే గడిచిపోయింది. లేక లేక కలిగిన అరుణపై తల్లి దండ్రులకు గారాబం ఎక్కువ కావడంతో - అరుణకు చిన్నతనంలో పెంకితనం, పేచీతనం ఒకపాలు అధికంగానే వుండేవి. దానికితోడు ఆమెకు తెల్లదొరపిల్లలతో నేస్తము ఎక్కువ. అమిత వ్యయానికి, ఆగడానికి ఇది విశేషంగా తోడుపడింది. అరుణపై గారాబంతో తండ్రి ఆమె శిక్షణకై క్రమమైన కట్టుబాట్ల కొరకు అంతగా శ్రద్ధవహించలేదు. ఆంగ్ల బిడ్డలతో మెలగడం వలన బాల అరుణపై-హైందవ కులాచారాల ఛాయలకంటె ఆంగ్లమతాచారాల ప్రభావమే అధికంగా ముద్రితమైపోయింది. తానూ ఒక తెల్లదొరసాని పిల్లవలె మారిపోయింది.

నిజానికి - అరుణ జీవితంలో - లాహోర్ ఘట్టం చాలా చిత్రమైనదనే చెప్పవచ్చు.

అరుణకు ఎనిమిదేండ్లు రాగానే - విద్యాభ్యాసంకోసం తండ్రి ఆమెను "సేక్రెడ్- హార్ట్- ఆఫ్- జీసస్- కాన్వెంటు" బడిలో ప్రవేశపెట్టాడు. ఇంతవరకు పాశ్చాత్య వ్యామోహం లోనే పెరుగుతూ వచ్చినదిగాని - అరుణ - కాన్వెంటులో

చేరిన నాటినుండి పాశ్చాత్యుల చేతులలోనే పెరుగసాగింది. అది నిజంగా ఆమెకు ఆనాడు అందలమెక్కినట్లే తోచింది.

ఆరుణ స్వతః అందమైనది, చురుకైనది. ఏది చూచినా- మరేపనిచేసినా - పరిశీలన, వివేచన అరుణకు అధికంగా వుండేవి. ఆనాడు కాన్వెంటు బడిలో చేరిన భారతీయ బాలబాలికలలో అరుణకున్న ఈ ప్రత్యేకగుణగణాలు మరెవరికిని కానరాక పోవడంవల్ల - కాన్వెంటు అధికారుల దృష్టి అరుణపై బాగా ప్రసరించినది.

తోడిపిల్లలపై పెత్తనం చెలాయించే పెద్దతనం, ఆటపాటలలో అందరిని మించిన చాకచక్యం, పది మందిని వెంటవేసుకొని దుందుడుకు పనులుచేసే చురుకుతనం అరుణలో చిన్ననాటినుండి ప్రకాశించిన ప్రత్యేక లక్షణాలు—కాన్వెంట్ అధికారిణి "సిస్టర్ సుపీరియర్"ను బాగా ఆకర్షించినవి. దానితో ఆమెకు అరుణ గారాబుబిడ్డ అయిపోయింది. అరుణ చిలిపితనాన్ని, చురుకుతనాన్ని, ఆమె చక్కగా తీర్చిదిద్ది చక్కని బాటలోనికి వాటిని మళ్ళించింది - "కాన్వెంటు"లలో ప్రవేశించి, విద్య నభ్యసించు భారతీయ బాలికలు ఆ నాడు చాల తక్కువ. హైందవులకు మతమే - సర్వస్వము, ప్రాణాధిక్యముగా వుండే ఆ రోజులలో - "కాన్వెంటు" కిరస్తానీ పాఠశాలలకు తమ తమ బిడ్డలను పంపడమంటే సుతరామూ సరిపడేదిగాదు. దీనికి తోడు ఆ చదువులకు వ్యయమధికము. బట్ట దగ్గర నుండి - వేతనంవరకు - మిక్కిలి ధనవ్యయాన్ని భరించవలసి వుండేది. అందువల్ల "కాన్వెంటు స్కూళ్లు" చాలా వరకు ఖాళీగానే వుండేవి.

కాని - భారతీయ బాల బాలికలలో విద్యాబోధన ద్వారా - క్రైస్తవమతాన్ని - ప్రచారం చేయవలెననే సంకల్పాన్ని నెరవేర్చుకొనడానికి ఆయామిషనరీలు పైపైమెరుగులను, ఆకర్షణలను కనుపరుస్తూ వుండేవారు. తెలివైన బాలికలను చేరదీసి, పాటలునేర్పి, బహుమతులిచ్చి లొంగొనేవారు. పిల్లల కొకమోజు, తల్లిదండ్రుల కొక ఆశ కలుగునట్లుగా నిత్యనూతనమైన పద్ధతుల నవలంబించి - బాల బాలికలను ఆకర్షించడమే ఆనాటి - క్రైస్తవ మిషనరీలకు ప్రత్యేకమైన పనిగావుండేది.

సిస్టర్ సుపీరియర్ - ఈ విద్యలో మంచి నేర్పుగలది. అరుణ తెలివితేటలను గ్రహించిన ఆమెకు అరుణను తనంతటి దానిగా తయారుచేయవలెననే ఆశకలిగింది. ఎల్లవేళలా తనవెంట త్రిప్పుకొంటూ అరుణకు చక్కని కథలు, పాటలు చెబుతూవుండేది. క్రీస్తుదేవుని లీలలను - కృష్ణలీలల కంటె అరుణకు తియ్యగా వినిపించేది. "మేరీ" జీవితగాధలను అరుణచే ముచ్చటదీరా వల్లెవేయించింది— క్రీస్తుమత వేదమైన బైబిల్‌లోని చాటువులు, నీతులు కట్టుకథలుగా చెబుతూవుంటే సిస్టర్ సుపీరియర్‌పై అరుణకు ఎనలేని మమకారం కలిగింది. రంగు రంగుల గౌనులు, కొత్తమాదిరి దుస్తులు; సీతాకోక చిలకలవంటి చిన్న చిన్న కథలపుస్తకాలు - బొమ్మలు, ఆటపాటలకు తగిన వస్తువులు సంగీతాలు నృత్యగాన వేడుకలు - షికారులు, బంట్రోతుల సేవలు - ఒకటేమిటి? అరుణకు అన్నిటా ఒక నూతన వ్యామోహం, నవ్య జీవిత పథం కనుపించినవి. దానితో

అరుణ ఇంటిపట్టుమాని, సిస్టర్ సుపీరియర్ పజ్జనే రాత్రిం బవళ్ళు కాలంపుచ్చేది.

ఏటాపరీక్షలలో, ఉత్తీర్ణ అవుతూ వుం డ డ ము, ఏవేవో బహుమతులు, పతకాలు పొందుతూ వుండడము—, అరుణ దిన దినాభివృద్ధి నందుతూ వుంటే - తల్లిదండ్రులు ఆనంద పరవశులై పోతూవుండేవారు.

ఐదేండ్లు తిరిగిపోయాయి. అరుణా గం గూ లీ పూర్తిగా క్రైస్తవ బాలిక అయిపోయింది. ఆడేమాటలో చేసేచేతలో - మనోవాక్కాయ కర్మలా అరుణ ఒక "ఛోటా సిస్టర్ సుపీరియర్"లా తయారయింది.

అంతేకాదు - 14 ఏండ్ల ప్రాయం వచ్చుసరికి అరుణ హృదయంలో ఒక తీవ్రసమస్య మొలకెత్తి ఆమెను చాలా కలతపెట్టింది. "క్రైస్తవ సన్యాసిని (nun) గా జీవితాన్ని గడుపవలెను" నను సమస్య అరుణ మనస్సును బాగా కలవర పెట్టింది. ఎంత ఆలోచించినా - ఆమె సంకల్పాన్ని— గంగూలీ వంశపు హైందవ శిష్టాచార సంపత్తు ఏవిధం గానూ ఎదురొడ్డలేకపోయింది. ఆమె లేతమనస్సుపై సిస్టర్ సుపీరియర్ కలిగించిన ప్రభావమట్టిది. రంగు రంగుల బొమ్మలుగల చిన్న చిన్న పుస్తకాలు - కమ్మని కథలతో నిండివుండే మతగ్రంథాలు - చదివి చదివి - అరుణ - హిందూమతాన్నే మరిచిపోయింది, దీనికితోడు ఆ 'కాన్వెంటు' జీవితమే అరుణకు బాహ్య ప్రపంచంతోగల సంబంధాన్ని చాలావరకు సంకుచిత పరచింది. తెల్లవారినది లగాయతు - తిరిగి ఏదురపోవువరకు ఆమె మెలగునది. "క్రైస్తవ సన్యాసినుల"తోనే అవడంవల్ల - ఆమెకు - ప్రపంచమంతా

స్పర్థాకలుషిత మైనదని, ఆ ప్రపంచములో జీవితం ఒక నిత్యపోరాటమని : భారతీయ సాంప్రదాయాలలో స్త్రీకి బానిసకుకంటె అధికమైన హక్కులు లేనందువల్ల జీవితమే ఒక నరకమని - బాగా మనస్సుకు నాటింది.

అనుభవ పూర్వకమైన ఈ నీతులకు, నిశ్చయాలకు ఆమె అంకితమై పోవటంవల్ల - జీవితశేషాన్ని పవిత్రమైన "సన్యాసిని"గా గడిపివేయవలెననిపూర్తిగా స్థిరపరచుకొన్నది. వెంటనే ఇంటికి వెళ్ళి తల్లి దండ్రులతో తన నిశ్చయాన్ని గూర్చి తెలియజేసింది, ఆ అమాయిక గంగూలీ దంపతులకు అరుణ నిర్ణయం ఒక ఆశనిపాతం అయిపోయింది.

అరుణ తల్లికి ఆవేదన, తండ్రికి ఆగ్రహము ఒక్క త్రుటిలో పైకొన్నవి, వెంటనేవారు అరుణను తిట్టిపోశారు. కాన్వెంటు అధికారుల దుష్టబోధల్ని శపించారు. అరుణ మనస్సు ఏ విధంగా వంచింప బడినదో వారు తెలుసుకొని మిక్కిలి ఖేదపడ్డారు. ఇక నుండి ఆ కాన్వెంటుకు అరుణను పంపకూడదని వారు నిశ్చయించినారు. నాటితో అరుణకు కాన్వెంటుకు బంధం తెగిపోయింది.

లాహోర్ నగరంలోని "రోమన్ కాథలిక్ కాన్వెంటు"కు ఆమెకు సంబంధం తెగిపోయినదిగాని - అరుణ హృదయంలో పాతుకొన్న ఆ పాశ్చాత్యమత వ్యామోహం ఓ పట్టాన విచ్ఛేదంకాలేదు. స్వతః అరుణ దృఢనిశ్చయం గల యువతి. చపలత్వమనునది ఆమెలో ఆదినుండిన్నీ లేదు. మతంలోనే కాని, ఆచారవ్యవహారాలలోనేకాని కొంత విషయ పరిజ్ఞానాన్ని సంపాదించవలె నని ఆమె బుద్ధిపూర్వ

కంగా ఎన్నడును ప్రయత్నించలేదు. కాని - విద్యాభ్యాసము పేరిట క్రైస్తవ మతము, హేతువాదము, భారతీయ ఆచారాల యెడల వైముఖ్యము - మొదలగు బుద్ధులు ఆమెకు అప్రయత్నంగానే అలవడి పోయాయి

హైందవ మత సాంప్రదాయాలు పవిత్రముగా రూపొందిన "గంగూలీ" వశంలో జన్మించి నప్పటికి అరుణకు ఆనాటికి వాటి ఘనత తెలియదు, తెలిసికొన వలసిన ఆవసరమూ ఏర్పడివుండలేదు. ఇటు హైందవ మత విజ్ఞానం తెలియక పోవడంతో అటు క్రైస్తవమతబోధ మిక్కుటమై ఆమెను లోగొనడంతో, అరుణ మనస్సు పూర్తిగా మారిపోయింది; చివరకు "క్రైస్తవ సన్యాసిని"గా మారిపోయి ఆ మతాన్ని సేవించాలనే నిర్ణయానికి కూడా వచ్చేసింది.

అట్టి అరుణ మనోనిర్ణయానికి - తల్లిదండ్రుల అనంగీకారము - ఆపైన భావనిర్బంధము ప్రాప్తించడంతో అరుణ ఇంచుమించుగా "ఉన్మాద" పరిస్థితికి లోనైనది. చదువులేదు, సంధ్యలేదు. ఇంటపట్టునే కాలక్షేపం. పూజలు, పునస్కారాలు - పండగలు, పబ్బాలు - నిత్యనూతన వాతావరణంలో అరుణ పరమత వ్యామోహితమైన "మనస్సు" పంజరంలోని చిలుకవలె టపటపలాడ సాగింది. చేయునది లేక, చేయగలిగినది లేక అరుణ - ఇంట్లో ఓమూల మంద గొడిగా పడివుండేది, మతిలేని పనులు చేస్తూవుండేది, అర్థహీనంగా మాట్లాడుతూ వుండేది.

ఇంట్లో కట్టబడివున్నది, కాని హైందవ సాంప్రదాయానుగుణ్యమైన "కట్టు - బట్ట" విషయంలో ఆమె తన

మనస్సును మార్చ లేక పోయింది. ఆచీర, ఆజాకెట్టు అంటే ఆమెకు మంటపుట్టేది. ఆనగలు ఆ అలంకారాలు అంటే ఆమెకు అసహ్యం కలిగేది. హిందూ ఆచారాలననుసరించి తనతోడి యువతులు చేసే "కట్టు - బట్టు - బొట్టు" సంబంధ మైన ప్రతిపనికి ఆమెలో ఒక అసహనము, అసూయ, ఆగ్రహము పై కొంటూ వుండేవి. బహిరంగంగానే వారిని దూషించి, ద్వేషించి - దెబ్బలాడేది, ఈవిధంగా మరి రెండేండ్ల కాలం గడిచి పోయింది.

అరుణయొక్క ఈ వింతమానసిక పరివర్తనం విప రీతంగా వుంటూవున్నా - అరుణ తల్లి విస్తుపోలేదు. నయాన్ని, భయాన్ని సద్బోధనలు చేస్తూ ఎప్పటికప్పుడు భారతీయాచార విశిష్టతను గురించి ఉద్బోధించ సాగింది. దైనందిన జీవితంలోని ప్రతిఘట్టం సందర్భంలోను, ఒక్కొక్క మహత్తర హంశాన్ని గూర్చి వివరిస్తూ అరుణ తల్లి - అరుణలో ఒక నూతన జ్ఞాన నేత్రాన్ని తెరచింది. విదేశమత వ్యామోహాన్ని - హేతువాదం ద్వారా ఆమె అరుణకు నచ్చజెప్పసాగింది. అరుణ తండ్రి కూడా అరుణలో భారత జాతీయత సమగ్రంగా వికసించడానికి సకల శ్రమ లను పడ్డాడు.

అరుణకు - ఆమె చెల్లెలు పూర్ణిమకు-ఆనాటి కానాడు భావంలో, చేతలో, చివరకు రూపంలో వుంటూ వుండిన అంతరం తరిగిపోయింది. అరుణ తిరిగి హిందూ ఆచార లను అలవరచు కొన్నది! ద్వేషభావాలు, రోషతామసాలు ఆమెలో అణిగి పోయాయి. - అరుణకు మాత్రమేగాదు, పూర్ణిమకుకూడా సరియైన విద్య లభించుటలేదు. ఇంట్లో

జ్యోతి లభించింది. దానిని అరుణ పెన్నిధిగానె భావించు కొన్నది.

నెహ్రూ కుటుంబంలో తానుకూడా ఒకతెవి అపూర్వ మైన భావశబలతను ఆర్జించింది. మతంలోను, జీవిత లక్ష్యం లోను అరుణకు ఒక నిశ్చలమైన, నిబ్బరమైన నిక్కువ మైన దృఢచిత్తం ఏర్పడింది—

కాని రాజకీయాలలో ఆమెకు ఏమీ అంతు చిక్క లేదు. సదాగ్రంథాలను పఠిస్తూవుండడమే ఆమెకానాడు పెద్ద పని. నెహ్రూగృహంలోను, బహిరంగ సభలలోను జరు గుతూవున్న రాజకీయ చర్చలను వింటూ మౌనంగా వాటి నన్నిటిని "స్వాహా" చేస్తూవుండడమే ఆమెకు ఆ నా డు నిత్యకృత్యం. అవకాశం చిక్కినప్పుడు తనకు చనువువున్న వారినినిలవేసి "సామ్యవాదాన్ని"గూర్చి చర్చలు సాగించేది.

'ఆనాటి అరుణ రాజకీయ పరిజ్ఞానాన్ని గురించి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ అన్నమాటలను ఈ సంద ర్భంలో చెప్పకొనడం సందర్భోచితంగా వుంటుంది:

అరుణ వివాహసమయంలో ఆశీర్వచనాలను పంపుతూ నెహ్రూ సోదరి శ్రీమతి విజయలక్ష్మి అన్నది: "అరుణను ఈనాడు చూస్తూవుంటే - నాకు వెనుకటివి - ఏవేవో తీయని తలపులు స్ఫురణకు వస్తూవున్నాయి. అరుణ మాతో రాజ కీయాలను చర్చిస్తూవుంటే - ఆనాడు "వచ్చీరానీ మాటలు, ముగ్గీ ముగ్గనిపండ్లు" ఎంతోరుచి అన్నట్లు ఎంతోముచ్చటగా వుండేది. అట్టి అరుణకు ఆ నాటినుంచి నాశుభాకాంక్షలు వుంటూనే వున్నాయి."

జీవితాన్ని ఒక పోరాటం అంటారు. అయితే రాజ కీయ జీవితం ఒక సంగ్రామమే అని చెప్పితీరాలి. రాజకీయ జీవితంలో అభిరుచి కలిగినవ్యక్తికి ఇతర పనుల మీద మనస్సు నిలువదు. రాజకీయాలు మినహాగా ఇతర కార్యా లకే ప రు. అశక్తులు, అసమర్థులు కూడా అయిపోతూ వుం టారు. దీనికి కారణం ఈనాటి భారత రాజకీయాలలో గర్భి తమైవున్న "స్వాతంత్ర్యేఛ్ఛ" అనే తీవ్రాశయం ఒక్కటే ఐవుంది.

నెహ్రూ కుటుంబంతో సహవాసంలభించిన అరుణకు "చదువు" మీద శీతకన్నుపడింది. ఇప్పుడు వెనుకటి వలె ఆమె స్కూలుపుస్తకాల పక్షి కాదు. రాజకీయ గ్రంథాలు చదువుతూ వుండడము, తోడివారితో మహిళా సమస్యలను గూర్చి చర్చిస్తూ వుండడము-అరుణ దినకృత్యమైపోయింది.

మోతీలాల్ పండితుని గృహవాతావరణం అరుణకు సాంఘిక, రాజకీయ చైతన్యదాయి మాత్రమే కాలేదు- దేశ భక్తిని కుడా ఆమెకు ఉపదేశించింది. దేశభక్తి ప్రబోధం పొందిన ఆమె తరుణ హృదయంలో - యువరక్తంలో విప్లవభావాలు కెరళ్లువార నారంభించాయి. ఏదో చేయాలని ఒక ఉత్సాహం- ఏవో ఉద్యమాలను లేవనెత్తాలని ఒక ఉద్రేకం- ఏవేవోవిప్లవాలనే రేకెత్తించాలని ఒక ఉద్వేగం; అస్థిర కార్యక్రమంతో, అనిర్దిష్టయత్నంతో - అరుణ నైని టాల్ పట్టణంలో షుమారు ఐదేండ్లు గడిపింది—

ఇంతలో ఆమె జీవిత నౌకకు మరియొక సుడిగాలి ఎదుర్కొన్నది.

అరుణకు 16 ఏండ్లుదాటి పోయాయి. ఇక వివాహం చేయాలి - అని తల్లి దండ్రులు నిశ్చయించుకొన్నారు. తండ్రి ఇరువురు కొమార్తెలకు సాంప్రదాయ ప్రసిద్ధమైన కుటుంబాలకు చెందిన సంపన్న పుత్రులను స్థిరపరిచాడు. కళ్యాణ కార్యాలకు కావలసిన సకల సన్నాహాలుచేశాడు. కాని అరుణకు ఆ వివాహం - కాదు - అసలు "వివాహం" అంటేనే ఆనాడు రుచించలేదు. తనకు పెండ్లి చేసికొను నిచ్ఛలేదని తల్లి దండ్రులకు నిక్కచ్చిగా చెప్పివేసింది. ఇక ఆ ప్రయత్నాన్ని విరమించు కొనటం తప్పితే వారానాడు అరుణను నిర్బంధించ లేక పోయారు. సుప్రసిద్ధ బెంగాలీ బెనర్జీ వంశోద్భవున కిచ్చి పూర్ణిమకు మాత్రం వివాహం సలక్షణంగా జరిపారు.

అరుణ జీవితంలో అది ఒక సుడిగుండాన్ని తెచ్చి పెట్టిన సమయం, అరుణ తండ్రి హృదయ చలనం ఆగిపోయి అకస్మాత్తుగా మరణించాడు. పుత్రికల నిరువురను పెట్టుకొని నైనిటాల్‌లో అరుణ తల్లి కాలక్షేపం చేస్తూ వుంది. బిడ్డల విద్యాభ్యాసం, వారికి భవ్యమైన భవిష్యత్తు ఈ రెండు సమస్యలు ఆమెకు రాను రాను చాలా భారమైపోయాయి.

అరుణ ఈ పరిస్థితిని గమనించింది, తనకు వివాహం కాలేదు - "పెళ్ళి" అంటేనే ఆమెకు ఉల్లాసంలేదు. సాంఘికోద్ధరణ, స్త్రీ జనసేవ, రాజకీయ కృషి - పెక్కు సమస్యలతో ఆమెహృదయం సంక్షుభితమైవుంది. వివాహం చేసికొంటే అన్నీ కొనసాగవని ఆమెకు భయం. ఆశయాలను చంపుకొనడం అంటె - ఆత్మను ఖూనీచేయడమే అవుతుంది.

పతితమానవసేవ, తన్మూలంగా దేశసేవలతో జీవితాన్ని సార్థకంచేసికొన వలెననే, ఆమె ఆకాంక్షకు ఆనాడు సరియైన ఆధారం ఏమీ లభించలేదు. పైగా ఇంటి సమస్యలన్నీ వాటికి పెద్ద ఆవరోధాలుగా పరిణమిస్తూ వున్నాయి.

వెంటనే తల్లిని, చెల్లెలిని - అలహాబాదులో చెల్లెలి అత్తవారింటికి పంపివేసింది. తాను కలకత్తాలో జీవితభృతిని ఆర్జించు కొనవలెనను తలంపుతో దీర్ఘమైన ప్రయాణం చేసి కలకత్తా చేరుకొన్నది. అచిరకాలంలోనే - ఆనగరం అపరిచితమైన దైనప్పటికిని - ఆమెకు "గోఖలె మెమోరియల్ బాలికల పాఠశాల"లో ఉపాధ్యాయినీ వృత్తి లభించింది. ఆ వృత్తిలో కొంతకాలంవుండి, కొంత ధనాన్ని నిలువచేసుకొని, ఇంగ్లండు పోయి ఉన్నత విద్యలను అభ్యసించి, తిరిగి భారతదేశం వచ్చి - దేశోద్ధరణకై జీవితాన్ని అంకితం చేయవలెనని ఒక భావి ఆశయ పథకం అల్లుకొన్నది—

ఆశయాలు అల్లికలైతే - జీవితం మల్లెల పందిరి అవుతుంది. కాని - దానికి అవకాశం, ఆధారం లభించవలె గదా! ఈలోగా ఆజీవితలత ఏ వృక్షంపైకి ఎగబ్రాకుతుందో! లేక పందిరి మీదనే పరిభ్రమిస్తుందో..........

కలకత్తాలోని గొఖలే మెమోరియల్ బాలికల పాఠశాలలో అరుణ జీవితం ఆరంభించింది—

ఈ నూతన జీవితంలో ఆమెకు రాజకీయాలు దూరమైపోయాయి. సాంఘిక సమస్యలు వాటి స్థానాన్ని ఆక్రమించాయి. భారత మహిళాభ్యున్నతికి సంబంధించిన సమస్యలు ఆమెకు కొత్తపాఠాలు అయినవి. పిల్లలకు చదువు

చెప్పడం అనేది ఆమెకు ఒక మానవమనశ్శాస్త్ర పరిశోధనా ప్రక్రియ అయిపోయింది. ఈ పరిశోధనలో ఆమె కృషిచేసి-కొన్ని కొత్త రీతులను అమలు పరచింది. విద్యాలయాధికారులు వాటిని ఉత్సాహంతో స్వీకరించారు. విద్యాలయ పాలక వర్గంలో ఆమెకు ఒక శాశ్వత స్థానాన్ని ఏర్పాటు చేయాల. కూడా నిశ్చయించు కొన్నారు. ఇది ఆమె ఉపాధ్యాయినిగావుండి ఆర్జించిన యశస్సు.—

కాని సాంఘిక రంగమో! ఆనాటికలకత్తా సాంఘిక రంగం ఆమె కొక కొత్త ప్రపంచం. కాగా సాంఘిక సమస్యోద్ధరణకై వెంటనే నడుముకట్టుకొని రంగంలో ప్రవేశించడం కంటె - ముందుగా ఆనాటి సాంఘిక సమస్యలతో బాగా పరిచయం సంపాదించుకొన్నది. ప్రత్యక్షాను భవంతో పాటు. సంఘాన్ని బాగా అర్థం చేసుకొన్నది. సమస్యల అంతరార్థాన్ని ఆకళింపుకు తెచ్చుకొన్నగదా, సంస్కరణకు అనువైన మార్గాల ననుసరించ గలుగునది....?

అచిరకాలంలోనే ఈసాధన అంతాపూర్తి అయింది. తన సంస్కరణోద్యమానికి, విద్యాప్రబోధానికి వేరుగా ఒక కేంద్రంవుండాలని ఆమె ముందుగా ఒక భవన నిర్మాణానికి తలపెట్టింది. ఉదారులు, సంఘచైతన్యాకాంక్షులు అగు ప్రముఖుల సహాయ సంపత్తి ఆమెకు అయాచితంగానే లభించింది. ఆ సహకార సానుభూతులతో ఆమె "సరస్వతీ నిలయం" అను ఒక భవనాన్ని నిర్మించి, తన సాంఘికోద్యమాలకు దానిని కేంద్రపీఠం చేసుకొన్నది.

ఆ కేంద్రంనుండి ఆమె మొట్టమొదటగా ప్రబోధించినది విద్యా సమస్య. ఆ వెనుక బాల్యవివాహ నిరోధం,

సాంఘీక చైతన్యానికి, అఖండమైన సాంఘికోద్యమాలకు పుట్టినిల్లు అయిన వంగభూమి ఆమె ప్రబోధాలకు ఉత్సాహం గానే ప్రతిధ్వని ఇచ్చింది. అరుణ అల్పవ్యవధిలోనే వంగ దేశమంతటా బ్రహ్మాండమైన ఒక మహోద్యమాన్ని లేవనెత్తింది. విద్యాధికులైన స్త్రీలు తక్షణమే ఆమెకు అండ గానిలిచారు. ఫలితంగా ఆమె సాగించిన ఉద్యమం ఇటు ప్రజల సానుభూతిని, అటు ప్రభుత్వాదరాన్ని అందుకొన్నది. వంగవనితాలోకంలో అరుణ ఒక ధృవతార అయిపోయింది. ఇది ఆమె కలకత్తా జీవితంలో ఆర్జించిన సాంఘీకసేవ.

స్వయం ప్రతిభయైన ధీశక్తి, ఓటమి నంగీకరించని కార్యపరతంత్రత, ఉత్సాహావేశాలతో ముందుకు చొరుచు కొనిపోయే చాతుర్యం - అరుణకు సహజాలంకారాలు. రాగా-రెండేండ్ల కలకత్తా జీవితంలో ఆమె రెండు ఘనకార్యాలను సాధించిందంటే అది అపూర్వమేగాదు; అన్యన్యసాధ్య విశేషం కూడాను.

సాంఘీక సేవారంగంలో అనేక అవరోధాలను అతి క్రమించి - సానలుదేరిన వజ్రంవలె ఆమె కీర్తి కాంతులను వెలారిస్తున్నది, అ ప్రయత్నంగా ఆ కాంతులలో మరి కొన్ని కొత్తవెలుగులు చేరి-మిళితమై పోయాయి అనుకో కుండానే ఆమె జీవితలత పరాశ్రయాన్ని చేరి ప్రాకి పోయింది. "ఇంగ్లండు పయనం-ఉన్నతవిద్యాభ్యాసం" అనే ఆమె వెనుకటి ఆశయ పథకం విస్మృతికి జారి - వేరొక నూతన ఆశయచక్రం తిరుగ నారంభించింది. అరుణ నూతన అరుణ అయిందిౘ!



పందొమ్మిది వందల ఇరవై ఎనిమిదవ సంవత్సరం గ్రీష్మఋతువు అది—

వేసవి కాలపు విరామానికి అరుణ అలహాబాదు చెల్లెలి గృహానికి విచ్చేసింది. పూర్ణిమా బెనర్జీ దంపతులు అలహాబాదులోనే వుంటూవున్నారు. మోతీలాల్ నెహ్రూ కుటుంబం కూడా అప్పుడు అచటనే వుంటున్నది. నెహ్రూ పండితుని గృహం "ఆనందభవన్" అప్పటికే జాతీయ కాంగ్రెసు కేంద్రకార్యాలయమై-జాతీయ భారతావనికి ముఖ్య పట్టణమై, యాత్రాస్థలమై వుంటున్నది. తన చెల్లెలు, చిన్ననాటి సహచరులు - ఇరువురు అచటనే వుండటంచేత అరుణ అలహాబాదులోనే వేసవిని గడపవలెనని నిశ్చయించుకొన్నది.

"కళ్యాణంవచ్చినా, కక్కువచ్చినా ఆగవు" అని సామెత ! ఇది యదార్థమే అనునట్లు పూర్ణిమా బెనర్జీ ఇల్లు దీనికి సాక్షీభూతమైనది. పూర్ణిమ భర్తకు - ఆసఫ్ ఆలీకి చిరకాల స్నేహము. కలకత్తాలో సమావేశమైన అఖిలభారత ముస్లిమ్ లీగ్ సభలకు హాజరై తిరిగివస్తూ ఆసఫ్ఆలీ అలహాబాదులో దిగినాడు; దిగి మిత్రుడు బెనర్జీ ఇంట విడిసినాడు. వారం, పదిరోజులపాటు మిత్రునితో కాలంగడిపి పోవలెననేగాని-ఆసఫ్ ఆలీకి అచట అన్యకార్యకలాప మేమీ వుండలేదు.

కాని - బెనర్జీ ఇంటిలో అడుగుపెట్టిన మరుక్షణం నుంచి - అతని హృదయ ఫలకంపై ఒక కుసుమకోమల విగ్రహం ప్రతిబింబించసాగింది. అరుణకున్ను - ఏదో తెలియరాని అభిమానం అసఫ్ ఆలీపై కుదురజొచ్చింది.

విద్యానిధి. విదేశసంచారం చేసి అప్పుడే వచ్చాడు. ప్రపంచ సమస్యలనన్నిటిని కాచివడబోసి నట్లుగా మాట్లాడుతున్నాడు. విజ్ఞాన పూర్వకమైన సంస్కారం అతనిలో చిప్పిలుతున్నది. గంభీరంగా భావస్ఫోరకంగా అతడు మాట్లాడుతూవుంటే ఆదర్శాలు ఊహాప్రపంచంలో మేడలు, మిద్దెలు కట్టుకొంటున్నవి. నిండైన విగ్రహం. నిర్మలమైన వర్చస్సు, నీటైన దుస్తులు ధరించిన అతని సుందరవిగ్రహం సూటిగా అరుణ సుందరతర హృదయంలో చోటు చేసుకొన్నది.

విద్యావతి, సాంఘిక సేవాపరాయణ. ఆశయాల కోసమే జీవిస్తూవున్నట్లుగా ఏదో పెద్ద ఆకాంక్షావృతమైన విశాల నేత్రాలు, స్థిరచిత్తము, ధీరవచనము, కలభాషిణి, విశేషించి గ్రంథమథనము చేసిన పరిజ్ఞానముగల అరుణ అసఫ్ ఆలీకి ఆత్మీయమై పోయింది.

సారస్వత చర్చలు, సాంఘికవాదాలు, రాజకీయ వ్యాఖ్యానాలుగా ఆరంభమై వారి ప్రసంగాలతోపాటు హృదయాలుకూడా ఒకదాని నొకటి ఒరచుకొన్నాయి.

ఆ అభిమాన హృదయాలలో కుదురుకొన్న పరస్పర వాత్సల్యం - చివరకు ప్రేమగా పరిణతిపొందింది. ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకొన్నారు. వివాహం చేసికొనవలెనని కూడా దృఢనిశ్చయులైనారు.

కాని - వారిరువురి వివాహానికి సంఘం, సాంఘిక వాతావరణం సుముఖంగాలేదు. సంఘం వేయితలల నాగు పామై బుసకొట్టింది. అరుణ హిందూ స్త్రీ, ఆసఫాలీ మహమ్మదీయుడు, మత నియామాలకు, సాంప్రదాయాలకు ఇది కేవలము విరుద్ధమైనదని-అరుణ జ్ఞాతులు ఆగ్రహోయత్త చిత్తులైనారు, ఇంతేకాదు-అరుణ వయస్సు 18 ఏండ్లు ఆసఫ్ ఆలీకి అప్పటికే 41 సంవత్సరాలు నిండినవి, ఈ వివాహము సముచితిమైనది కాదు - అని ప్రజలు వెక్కిరించారు; ఈసడించుకొన్నారు,

లోకంపోకడ చూడగానే అరుణ హృదయంలో అశాంతి ఉబుకులెత్తింది తాను మనసారాకోరిన పురుష ః వివాహమాడడమా ? లేక ప్రజావిమర్శలను గణించి తన ప్రేమఫలాల్ని వి౦డనాడడమా ? ఈ సమస్యలతో ఆమెహృదయం చాలా ఘర్షణ పడింది. కాని - ఎట్టి ప్రతీకారం జనించినా అరుణ తన నిర్ణయాన్ని మాత్రం మార్చుకొన నంగీకరించలేదు. అంత్యపరిణామం ఎట్లున్నప్పటికిని ఆసఫ్ ఆలీనే పరిణయమాడడానికి అరుణ కృత నిశ్చయం చేసికొన్నది.

అరుణకు వలెనే ఆసఫ్ ఆలీకి కూడా స్వీయమతాహంకారుల తిరుగుబాటు తప్పలేదు—

ఢిల్లీనగర ప్రజాజీవితంలో ఆసఫ్ ఆలీ అప్పుడప్పుడే కీర్తిని చూరగొంటున్నాడు. మహమ్మదీయ జనబాహుళ్యంలో ఆతనికి మంచి పలుకుబడివున్నది. అందువలన మతాభిమానులగు పెద్దతరగతుల వారందరు ఆసఫ్ ఆలీ

వివాహాన్ని గురించి విమర్శించారు. మరికొందరు ఆతణ్ణి "కాఫర్" అని కూడా తిట్టిపోశారు.

కాని ఆసఫ్ఆలీకి - అతని తల్లి ఈసందర్భంలో పెద్ద అండఅయింది. కొమారుని అంతరంగమెరిగిన ఆమె ఆతణ్ణి ఆశీర్వదించింది. ఆసఫ్ ఆలీ స్వతః మత మౌఢ్యులను సరకు గొనువాడు కాకపోవడం చేతను - తల్లి ప్రోత్సాహంచేతను - అరుణను తన హృదయంనుండి తొలగించ లేక పోయాడు.

జాతి, మతవర్గ స్వార్థాలకు అతీతమయిన "ప్రేమ"కు ఎప్పుడును విజయంలభించకపోదుకదా !

వివాహ ముహూర్తం నిశ్చయమైనది కాని బంధు వులు రా నిరాకరించారు. మిత్రులు మొహంచాటువేశారు. అయినా - ఇద్దరు ముఖ్యబంధువులు మరిముగ్గురు ప్రాణ స్నేహితులు వివాహానికి విచ్చేశారు. వారి సమక్షంలోనే - విశేషమైన తంతు, తతంగంలేకుండానే క్లుప్తంగా; నిరా డంబరంగా అరుణ-ఆసఫ్ ఆలీల వివాహం జరిగిపోయింది. ఆగమించిన ఆ ఆప్తబంధువులు ఆశీర్వదించారు. ప్రాణ మిత్రులు దీవనలిచ్చారు. ప్రకృతి తథాస్తుఅన్నది. ఆక్షణం నుంచి "అరుణా గంగూలీ" "అరుణా ఆసఫ్ఆలీ" అయి పోయింది. కేవలం ఒక దేశసేవికగా వుంటూవచ్చిన అరుణ నాటినుండి పరిపూర్ణ స్త్రీ మూర్తి ఐ జాతీయ జీవనరంగంలో అడుగు పెట్టింది.

అరుణ జీవితంలో వసంత ఋతువు ఆరంభమైనది. జీవిత మధువును ఆస్వాధిస్తూ ఆమె ఆసఫ్ ఆలీతో ఢిల్లీనగ రంలో కాపురం పెట్టింది.

ఢిల్లీనగరంలో ఆసఫ్ ఆలీపేరెన్నికగన్న బారిష్ట ర్లలో ఒకడు. పరువమైన "ప్రాక్టీసు"తో అతని యశము, ధనము పొంగిపరవళ్లు వారుతున్నవి. సరస సద్గుణ సంప న్నుడు; లలితకళా కోవిదుడు. 1888 లో జన్మించాడు. ఢిల్లీ లోని సెంట్‌స్టీ వెన్సు కాలేజీలో చదువుకొన్నాడు. బారిస్టరు పట్టాన్ని ఆర్జించాడు. యూరపు ఖండమంతా సంచారంచేసి వచ్చాడు. నవభావ విలసితుడై భారత జాతీయ కాంగ్రెస్‌లో జాతీయ ముస్లిమ్ పక్షాన అడుగుపెట్టాడు. గాంధీజీ అను చరుడై స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని కారాగార క్లేశా లను అనుభవించాడు. మౌలానా అబ్దుల్ కలామ్ అజాద్ అతనికి గురువు. పండిత జవహర్‌లాల్ నెహ్రూకు అతడు కుడిభుజము. ఢిల్లీలోని హిందువులకు, మహమ్మదీయులకు కూడా అతడు అభిమానపాత్రుడు. లాహోర్ బాంబు కేసులో అతడు భగవత్‌సింగ్ పక్షాన న్యాయవాదిగా పనిచేసి భారతీ యుల వాత్సల్యాన్ని చూరగొన్నాడు. అసఫ్‌ఆలీ కీర్తిచంద్రి కలు విప్పారడానికి అవియే తొలిఘడియలు.

రాజకీయాలతోనేగాదు - ఇస్లామ్ మతవిజ్ఞానాలలో మౌలానా అబ్దుల్‌కలామ్ అజాద్‌కు ఎట్టి పవిత్రస్థానము న్నదో - ఆధునిక ముస్లిం సాహిత్య ప్రపంచంలో ఆసఫ్ అలీకి అట్టి "నవకవి" స్థానమున్నది. మేలుపదాలనుకూర్చి, భావవీచికలకు అతడు భావగీతాలలో మెరుగులు పెడతాడు. ముస్లిమ్ యువలోకం అతని పద్యాలకు చెవికోసుకొంటుంది.

కళాహృదయుడు కనుక - అరుణకుసుమ కోమల హృదయాన్ని ఆకర్షించాడు; మనసారా హత్తుకొన్నాడు. సద్‌హృదయులు, సంస్కారప్రియులు ఆ దం ప తు ల ను

హర్షించారు. అరుణ ఆసఫ్ అలీలు - ఢిల్లీ పౌరప్రపంచంలో ఒక అపూర్వమైన జంటవలె మెరసిపోతున్నారు.

అరుణ జీవితంలో నూతనఘట్టం ఆరంభంమైనట్లు గానే - నూతన సమస్యలు, నూతన అనుభవాలుకూడా తొంగిచూడ నారంభించాయి. దాంపత్యమాధుర్యాన్ని వృద్ధి చేసి కొనడము సంసారాన్ని ఎన్నికగా సమర్థించుకొనడము చివరకు తన వివాహాన్ని సార్థకం చేసికొనడము అరుణకు, ఎన్ని ప్రతిరోధాలు వచ్చినా తెలుసు.

ఇందుకు ఒక్క ఉదంతాన్ని గురించి వింటే- అరుణ చతురత, పట్టుదల అర్థమవుతుంది.

ఆసఫ్ అలీ ఉర్దూ,పరిషియన్ భాషలలో కూలంకష పరిజ్ఞానము కలవాడు. ఆభాషలలో అతడు రచించిన గేయాలు సాహితీప్రియులకు అమృతగుళికలు.

ఆసఫ్ అలీ ఆంతరంగిక మిత్రుడు, బంధువు అయిన ఫరీద్ అన్సారీ తరుచు అరుణతో అంటూఉండేవాడు: "వదినా! ఉర్దూలో మాట్లాడటం నీవు ఎప్పుడు నేర్చుకొంటావు? ఆసఫ్ అలీ నీమీద శతకాలకొలదీ పద్యాలు, గేయాలు వ్రాస్తూవున్నాడు- అతని వ్రాతలు చూస్తూవుంటే అతిత్వరలో "సిరాకరువు" వచ్చే లక్షణాలు కనబడుతున్నాయి....ఏమైతే ఏమిలాభం? వాటిలోని మధుర గీతాలను చదువుకొని నీవు ఆనందించ లేక పోతున్నావుగదా ...నామనస్సు చివుక్కుమంటూవుంది...."

ఈ విధంగా ఫరీద్ అన్సారీ అస్తమానమూ వేధించడంవల్ల - ఒకనాటి ఉదయం - ఉర్దూభాషను నేర్చుకొంటానని కొన్నిరోజులలోనే పూర్తి చేసి వేస్తానని అతనికి వాగ్దా

నం ఇచ్చింది. ఇచ్చినట్లుగానే అరుణ, పంతంపట్టినట్లు— అత్తగారివద్ద శిష్యరికం చెయ్యడం మొదలుపెట్టింది. ఆసఫ్ ఆలీతల్లికి అరుణఅంటే మిక్కిలిప్రేమ. ప్రతిదినము విద్యా బోధనతో - తీవ్రకృషిచేసి ,అరుణ కొన్నిరోజుల వ్యవధి లోనే ఉర్దులో వ్రాయను, చదువను నేర్చుకొన్నది. కాని పూర్తిపరిజ్ఞానాన్ని సంపాదించు కొనుదాకా ఆమెకు ఓపిక లేక పోయినది. చిత్రమేమంటే-అరుణ ఉర్దూభాషలో.మాట్లా డటం, ఆ ఇంటిలో అందరికీ అదొక ఆనందము- బొంబాయి నుండి, కలకత్తానుండి వచ్చు ఆమె స్నేహితులకు ఒకవిధ మైన తమాషాగాను వుండేది-కరువుతీరా నవ్వుకునేందుకు - మనసారా ఆనందించేందుకు - అరుణ ఉర్దూభాషోపన్యాసాలు- ప్రతినిత్యము ఆయింట పూలతోరణాలు కడుతూవుండేవి—

తన దాంపత్య సుఖాన్నిగురించి, ఆసఫ్ ఆ లీ ని గురించి అరుణ తరుచు అంటూవుంటుంది: "అతడు నాకు భర్తమాత్రమేగాదు; సహచరుడు, ప్రోత్సాహకుడు.కూడాను అంతదయ, ఔదార్యముగల సద్గుణవంతులగు భర్తలు చాలా అరుదుగా వుంటారు....నిజానికి అతనివంటి విశాలహృద యులు వుండబోరు...." అని....

ఈసల్లక్షణమే అరుణ ప్రజాజీవితానికి దోహదకారణ మైనది. అచిరకాలంలోనే అరుణ ఢిల్లీసాంఘిక ప్రపంచంలో కాలు పెట్టింది— ఢిల్లికేంద్రనగరం కనుక ఆమెకు అట్టి అవకాశములన్నీ అతచేత లభించాయి. అఖిలభారత మహిళా సంఘంలో అమె ప్రధానపాత్రను నిర్వహించ నారంభించింది. ఆ మహాసభ అంతవరకు నామమాత్రంగా పడివుంటూ సాం వత్సరిక సమావేశాలను జరుపుకొంటూ నిస్తేజమై పడివుం

దేది కాని అరుణ అందుప్రవేశించి దానికి కార్యాలయము, కార్యక్రమము, కట్టుబాట్లు మొదలైన వాటిని రూపొందిం చింది. మహిళాసభకు పేరుకు మాత్రం అధ్యక్షురాండ్రు వుంటూవుండినా కార్యనిర్వాహకత్వం అంతా అరుణయే నిర్వ హించేది.

మహిళాసభద్వారా ఆమె చేసిన విద్యాప్రచారం సం యుక్తరాష్ట్రాల చరిత్రలో శాశ్వతంగావుండి పోతుంది. ముఖ్యంగా ఢిల్లిలో ఆమె ప్రముఖులను ప్రోత్సాహపరచి "ఇర్విన్ - కాలేజి"ని స్థాపించింది. ఆనాటి ఇర్విన్ ప్రభ్విణి అరుణకు సర్వవిధములైన సహకారాలను కలుగచేయడంతో అరుణ కృషి ఫలవంతమైనది. "ఇర్విన్ కళాశాల'లో బాలి కలకు కేవలము విద్యగరపడం మాత్రమేగాదు - విద్యార్థిను లను ఆదర్శవంతులైన దేశసేవికలుగా, సంఘసేవికలుగా, సంస్కార ప్రియులుగా తయారుచేయడానికి ఆమె వినూత్న విధానాలను అమలుపెట్టి అనుసరించింది.

ఇక ఢిల్లీనగర రాజకీయాలలో ఆమెప్రముఖపాత్రనే నిర్వహించింది. ఆసఫ్ ఆలి అఖిలభారత కాంగ్రెస్ కార్య కారిణీ సంఘసభ్యుడు అవగానే - ఆమెఢిల్లీలోని కాంగ్రెస్ రాజకీయాలలో ప్రవేశించింది యువకులలో కాంగ్రెస్ కార్య దీక్ష. యువతులలో కాంగ్రెస్ కార్యదక్షత పెంపొందించ డానికి ఆమె ముఖ్యంగా కృషిచేస్తూ వుండేది. ఢిల్లీకళాశాల లోని విద్యార్థులకు అరుణ ఒక ఆదర్శవ్యక్తి, మార్గచోదకు రాలు.

బయట చిన్న నాయకురాలువలె మెలిగినా-గృహంలో ఆమె ఆదర్శగృహిణిగా ప్రవర్తించేది ప్రశిద్ధకాంగ్రెసు నాయ

కుడుగాన ఆసఫ్ఆలీ ఇల్లు ఎల్లప్పుడు కాంగ్రెసు వాదులతో నిండిచిన్నసత్రవుపలె వుంటూవుండేది. అట్టికాంగ్రెసు ప్రముఖుల నంద రిఆమె తగినగౌరవమర్యాదలతో సత్కరించేది. వారందరిఅభిమానాలకు పాత్రమయ్యేది—

ఆసఫ్ ఆలీకి - అరుణ అర్ధాంగిమాత్రమేగాదు—రాజకీయ సహచారిణి; ఆశయప్రతిబింబము; స్వాతంత్ర్య సంగ్రామంలో ఎట్టి త్యాగాలకైనా వెంటవచ్చే సహధర్మచారిణి - ఆసఫ్ ఆలీకి అరుణ అక్షరాలా ధర్మపత్ని—

జీవితంలో - ఒక్కొక్కప్పుడు కొన్ని కొన్ని ఆక
స్మిక సంఘటనలు సంప్రాప్తమవుతూ వుంటాయి. ఆయా
సంఘటనలు కొందరికి వడగళ్ళవానలు అయితే-మరి కొంద
రికి పిడుగుల వర్షం అవుతూవుంటాయి, ఆకస్మిక సంఘట
నల ఫలితంగా కొందరి జీవితాలు తారాపథానికి పొంగటమో
పాతాళానికి క్రుంగటమో జరుగుతూవుంటుంది.

రాజకీయ జీవితంలో - ఈసత్యం నేడు బహుముఖాల
గోచరిస్తుంది. ఒక్కొక్క సంఘటన, ఒక్కొక్క ఉద్యమం
కొందరికి ప్రత్యేక విశిష్టతను రూపొందిస్తూవుంటుంది. నాయ
కత్వం, అనుచరవర్గం వారివారికి అయాచితంగానే లభిస్తూ
వుంటాయి.

అరుణ ఆసఫ్ ఆలీ రాజకీయ జీవితం ఆకస్మికం
అని కొందరు అనుకొంటూవుంటారు: కాని - ఈ అభిప్రా
యం సరియైనది కాదు.

అయితే - రాజకీయాలలో ఇంతకు పూర్వం అనగా
పిన్ననాటినుండి ఆమె కనపడకపోవచ్చు; కాని - ఆమెలో
రాజకీయ జీవితానికి వుండవలసిన లక్షణాలు సహజంగా
రూపొంది వున్నాయి. స్వతంత్రాలోచన - స్వేచ్ఛాకార్యాభి
లాష - పదిమందిని కూడగట్టుకొని పనిచేస్తూ వుండ
డము - నలుగురికి సలహాలిచ్చి అందరికంటె మిన్నగా
రాణించే చాతుర్యము - ఆమెకు పుట్టుకతోనే వచ్చిన సద్గుణా

లంకారాలు. ఈ ప్రత్యేక గుణాలే ఆమెలో అచంచలమైన ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించినవి. సాంఘిక సేవ కాని, విద్యా సేవగాని ఆమె నిరుపమానంగా చేయగలిగినదంటే - ఈ సద్గుణాశక్తులే చాలావరకు కారణభూతాలు.

కాని - రాజకీయాలలో మాత్రం ఆమెకు వివాహోత్పూర్వం అంతగా ప్రవేశంలేదు. పుస్తకాలను చదువుతూ వివిధరాజకీయోద్యమాల ఆశయాలను అంతరాలను ఆమె బాగా అవగతం చేసుకొన్నది. ఆమెకు ఉన్నగ్రంథ పఠనాభిలాషకు వివాహానంతరం చక్కని అవకాశము, ప్రోత్సాహము లభించినవి, విజ్ఞానమూర్తి ఆసఫ్ అలీ ఆమె జీవిత రంగంలో ప్రవేశించడంతో - అరుణా దేవికి అఖండమైన రాజకీయ చైతన్యం లభించగల ఉత్సాహ శక్తులు లభ్యమైనవి. కాగా-ఆమె రాజకీయ జీవిత పరిణామం క్రిమబద్ధమయిన కట్టుబాట్లతో సక్రమ పరిణామం పొందిందనే చెప్పాలి. కేవలము పుస్తకపరిజ్ఞానమైన ఆమె సామ్యవాద సిద్ధాంతాలు ఆసఫ్ అలీ విజ్ఞానయుతమైన వ్యాఖ్యానాలతో, విమర్శనలతో బలమైన ఆశయాలుగా మారిపోయినవి.—

అరుణ వివాహంచేసి కొనునాటికి - ఆసఫ్ అలి రాజకీయాలకు కొంచెం దూరంగానే వున్నాడు. భారత రాజకీయాలలో అంతకు ముందునుండి పనిచేస్తూవున్నప్పటికి - వివాహకాలం నాటికి అతడు రాజకీయాలలో అంతతీవ్రంగా పాల్గొనక పోవడంవల్ల - అరుణకు అతనివద్ద రాజకీయ శిష్యత్వం చేయడానికి ఉత్తమావకాశం లభించింది. ఒక వంక గ్రంధపఠనము, వేరొకవంక భర్త ప్రబోధము—

రెండున్ను విరాటంకంగా సాగుతూ వుండడంవల్ల అరుణ రాజకీయ విజ్ఞానాన్ని బాగా అలవరచు కొనసాగినది.

ఇంతలో 1930 ఉప్పు సత్యాగ్రహసమరం ఆరంభ మైనది.

గాంధి మహాత్ముని "దండి సత్యాగ్రహ యాత్ర" దేశంలో అపూర్వమైన సంచలనాన్ని కలిగించింది. భారత దేశమంతటా కాంగ్రెసు వాదులు శాసనధిక్కారోద్యమానికి గడగినారు. కాంగ్రెసు నాయకులు, కారాగార బంధితులవు తున్నారు. ప్రజలు తండోప తండాలుగా విప్లవోన్ముఖు లైనారు. సత్యాగ్రహ బందీల సంఖ్య వేలకువేలు దాటి పోతున్నది, "నిర్బంధదమన విధానాన్ని" అనుసరిస్తూ - బ్రిటిష్ సామ్రాజ్యనీతి వేయివిధాలుగా వెర్రెత్తి పోతున్నది. కనివిని యెరుగనట్టి - ఒక అపూర్వమైన స్వాతంత్ర్యపిపాస. విప్లవోత్సుకత - భారతావని అంతటా పొంగిపొరవళ్లు వారుతున్నది—

కాంగ్రెసువాది, స్వాతంత్ర్య సమరజోదు - ఆసఫ్ అలీ - ఇక రాజకీయాలకు దూరంగా వుండలేకపోయాడు. నూతన ఆవేశంతో అతడున్ను స్వాతంత్ర్య సమరంలో దుమికినాడు! ప్రభుత్వ బందీ అయినాడు—

"రాజకీయ చదువు"లో ఒక పాటిగా రాణకు వస్తూ వున్న అరుణ అభ్యాసానికి ఇది ఒక విధంగా పెద్ద ఆటం కమే అయిపోయింది. చదువుకు స్వస్తిచెప్పింది; కాని వెం టనే ఏమిచేయవలెనో మాత్రం ఆమెకు అర్థంకాలేదు. రాజ కీయ వాతావరణం అంతా ఆమెకు అయోమయంగా వున్నది. "సత్యాగ్రహం"లోని సత్తా ఆమెకు సుబోధకం కావడం

లేదు—కాగా అన్యరాజకీయ కార్యక్రమమయినా ఆమెకే మియూ తోచలేదు. అంతాగొడవ; గందర గోళము - ఒక వంక నిరాశ, ఇంకొకవంక ఆవేశము - అరుణ ఇంటి పట్టున ఉండలేక పోయింది. స్వాతంత్ర్య పథగామి ఆసఫ్ అలీకి అనుగామిని కాకుండా వుండలేక పోయింది.—వెంటనే కార్య రంగంలోకి ఉరికింది.—

"ఉప్పు" చెయ్యనూలేదు। మరొకరిని చేయమని ఉద్బోధించనూలేదు — ఢిల్లీ ప్రజల విప్లవాత్మను మాత్రం ప్రజ్వలింప జేయాలని అరుణ సమకట్టింది. స్వాతంత్ర్య పిపాసతో ఉడుకు లెత్తుతున్న యువరక్తం- అసలే సాహసిక - ఆపైన ఆవేశంపై కొన్నది.—ఒక మూర్తీ భవించినశక్తి స్వరూపిణివలె - ప్రజల హృదయాలను ఆవేశించింది. - కొన్ని వేలమంది నేల ఈనినట్లుగా సమావేశమైనారు, ఢిల్లీలోని చాందినీ చౌక్ జనసమూహంతో కిటకిటలాడుతున్నది. అరుణ వేదిక ఎక్కింది; 1857 సంవత్సరంనాటి సిపాయీల విప్లవాన్ని గురించి ప్రసంగించ నారంభించింది. ఝాన్సీరాణి శౌర్య ప్రతాపాలను గూర్చి ఉగ్గడించింది. బహదూర్‌షా, నానాసాహెబ్‌ల వీరసాహసాలను కీర్తించింది. మత మౌఢ్యాలను పారద్రోలి, ఐకమత్యంతో- బ్రిటిష్ సామ్రాజ్యశక్తిపై తిరుగుబాటు చేయాలన్నది. బ్రిటిష్‌జాతి ఒక్క పురుగుకూడా భారతదేశంలో ఉన్నంత వరకు నిదుర పోకూడదని ఉద్ఘాటించింది. సామ్రాజ్యాహంకారంతో, ఆయుధ బలోన్మాదంతో - నిరాయుధ భారత ప్రజలపై బ్రిటిష్ ప్రభుత్వం జరుపుతూవున్న అమానుష క్రియలను శపించి - అదౌష్ట్యవిధానాన్ని చీల్చి చెండాడవలెనని

విప్పులుకక్కింది. ఒక మహోద్విగ్నమైన స్వాతంత్ర్యా వేశంతో వాతావరణం వేడెక్కింది. ప్రజాసమూహం ఆ ఆవేశంలో ఉద్రూతలూగుతున్నది.—

• ఢిల్లీ చీఫ్ కమీషనర్ ఇక ఉండబట్టలేక పోయాడు. ఆమె ఉపన్యాసం ప్రజలలో కంటె అతనిలోనే వేడి వేడి సెగలను రెచ్చగొట్టింది. వెంటనే సాయుధబలగంతో వచ్చి అరుణను- అబలను - నిర్బంధించాడు. కాని - ఆమెపై రాజ ద్రోహనేరాన్ని మోపకుండా—ఢిల్లీ పోలీస్ అధికారులు మరొక నీచనేరాన్ని ఆపాదించడానికి పూనుకొన్నారు. "దేశద్రిమ్మరి - ఇల్లు, వాకిలి లేనిది - సక్రమమైన జీవన భృతిలేనిది—" అంటూ వింత వర్ణన వర్ణించి - సక్రమ ప్రవర్తనకు పూచీ ఇచ్చిన విడుదల చేసెదమని ప్రకటిం చారు. కాని - అరుణ హామీనివ్వ నిరాకరించింది. ఫలితంగా ఢిల్లీ ప్రభుత్వంఆమెకు ఒకసంవత్సరం కఠిన శిక్షవిధించింది.

అయితే - ఢిల్లి పోలీస్ అధికారివర్గం అతి తెలివి తేటలు అంతతోనే ఆగిపోలేదు; ఇంకనూ వింతయైన ఉడు కోత పువ్వులు పూచినవి—

అరుణ జైలుకు వెళ్ళిన కొలది మాసములలోనే "గాంధీ - ఇర్విన్" ఒడంబడిక జరిగింది. ఆ ఒడంబడిక ననుసరించి రాజకీయఖైదీలు అందరూ విడుదల చేయబడి నారు. కాని అరుణకు మాత్రం జైలువిముక్తి కలుగలేదు "అరుణ చాలా ప్రమాదకరమైన వ్యక్తి" అని 1931 లోనే ప్రభుత్వాధి కారులకు బాగాఆకళింపుకు వచ్చింది కాబోలు: అందుచేతనే - సమస్త రాజకీయ ఖైదీలను విడిచిపెట్టినా -

అరుణాదేవిని మాత్రం ప్రభుత్వం విడిచిపెట్ట సాహసించలేక పోయింది.—

కాని ప్రభుత్వం అనుసరించిన ఈ కుటిల చర్యకు వెంటనే తగిన సమాధానం వచ్చింది.—

లాహోర్ స్త్రీల జైలులో-కలకలం బయలుదేరింది. "అరుణను కూడా విడిచిపెట్టనంతవరకు - తాము కూడా బయటికి పోము" అని అరుణతోడి స్త్రీ ఖైదీలందరు కట్టు కట్టారు. అన్నపానాలు ముట్టకుండా తమ మాటపై పంతం పట్టారు. జైలు అధికారులకు ఇది విస్మయాన్ని కలిగించింది. ప్రభుత్వాధికారులకు తలతిరుగ నారంభించింది. ఉదయం ఆరుగంటలకు జైలులో స్త్రీ ఖైదీలందరు ప్రారంభించిన ఈ సత్యాగ్రహాందోళన సాయింత్రం ఎనిమిది గంటల-వరకు సాగుతూనేవుంది.—లాహోర్ స్త్రీల జైలుకు ఢిల్లీ అధికారవర్గానికి నడుమ టెలిఫోన్ సంభాషణలు వ్యవధి లేకుండా సాగిపోయినవి. చివరకు గాంధీజీని ఈ సమస్యలో కలుగ జేసుకొనమని ప్రార్థించడంవినా ప్రభుత్వాధి కారులకు గత్యంతరం లేక పోయింది.

గాంధీజీ - డా॥ అన్సారీ - ఇరువురు కలిసి "సత్యాగ్రహం విరమించమని - జైలు అధికారులను ఆయాస పెట్టవద్దని" జైలులోని స్త్రీఖైదీలకు విన్నవిస్తూ తంతి నిచ్చారు. అంతట సుశిక్షితులైన సైనికులవలె వారు నాయకుల ఆజ్ఞలకు బద్ధులై - సత్యాగ్రహాన్ని విరమించి-జైలును వీడి పోవడానికి అంగీకరించారు.

అరుణ ఏకాంతంగా జైలులో విడిచి పెట్టబడింది. ఆ ఏకాంతవాసం సుదీర్ఘమవుతున్న కొలది ఆమెలోని విప్లవ భావాలు పెల్లుబుక సాగినవి. కాని - ఆమె సహచర్యంలో విప్లవవాయువుల నాఘ్రాణించిన ఇతర ఖైదీలు - విడుమరనంది - బయటకు వచ్చి అరుణ విడుదలకోసం బ్రహ్మాండమైన ఆందోళన లేవదీశారు. కొలది రోజుల వ్యవధిలోనే ప్రజాందోళనకు ఫలితంగా, ప్రభుత్వం అరుణ ఆసఫ్ ఆలీని కూడా విడుదలచేసింది.

లాహోర్ స్త్రీల జైలు గుమ్మంవద్ద ఆనాడు కన్నుల పండువగు దృశ్యాలు....! 'సరిహద్దు గాంధీ' ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ - రెడ్ షర్ట్ దళంతో - అరుణకు అపూర్వమైన స్వాగతం ఇచ్చారు. లాహోర్‌లోని ప్రఖ్యాతజాతీయ నాయకులు అరుణను పూలమాలాలంకృతను చేశారు. పురవీధులన్నీ జాతీయ పతాకాలతో అలంకరింప బడినవి. బ్రహ్మాండమైన ఊరేగింపులో - జాతీయ సమధి కోత్సాహంలో— లాహోర్‌లోని హిందూ-మహమ్మదీయ శిఖ్ పౌరులు మిళితమయినారు; 'హిందూమహమ్మదీయ సమైక్యత'కు పరువపు చిహ్నమైన అరుణా ఆసఫ్ ఆలీకి - అట్టి ఐక్యతాపూర్వకమైన సుస్వాగతమే లభించింది. అట్టి జే జే లే ఆమెను ఆహ్వానించినవి ! !

అరుణ జీవితంలో ప్ర ప్రథమంగా రుచి చూచిన జైలు అనుభవమిది,—

జైలు జీవితాన్ని రుచిచూచింది; అచటి దుర్భర యాతనలకామె ఏమీ కలతజెందలేదు. కాని, ఆ జైలుకు పెట్టినపేరు మాత్రమే ఆమెకేమీ రుచించలేదు. "ఆడ జైలు"

అని దానికి నామకరణం చెయ్యడంలో- ఏదో కుట్రాలోచన వున్నట్లు ఆమెకు తోచింది. స్త్రీలను కించ పరుచవలెననే ధ్వని ఆ పేరులోవున్నట్లు ఆమెకు స్ఫురించింది. 'అడజైలు' ఏమిటి? అర్థహీనమైన మాట! జైళ్ళకుకూడా పుంలింగము, స్త్రీలింగము- లింగభేదాలు వున్నాయా? అసలు దానికి "మానవ హృదయమే" లేనప్పుడు ఈ లింగభేద మెట్లావచ్చింది? కాని - సామ్రాజ్యవాదుల భాషలలోను, వ్యాకరణంలోను ఏమి తంత్రాలు వుంటాయో! మరెన్ని కూట మంత్రాలు వుంటాయో!

1930-31 జైలు జీవితంతో - అరుణ రాజకీయ జీవితానికి యదార్థమయిన నాంది ప్రస్తావన జరిగింది. భర్త జైలుకు వెళ్ళినందున - తానుకూడా ఆదారిని పట్టిపోవలెనను తలంపు తప్పితే - ఆనాడు ఆమెకు నిర్దిష్టమైన రాజకీయాశయమేమీలేదు. తలవని తలంపుగా- తనకు తెలియకుండానే అరుణ కాంగ్రెసు వాదిని అయిపోయింది.

జైలునుండి బయటకు రాగానే - అరుణ ఢిల్లీ రాజకీయ ప్రపంచములో ఒక పెద్దతరహా వ్యక్తిగౌరవాన్ని చూరగొన్నది. సాంఘిక ప్రపంచమేగాదు: రాజకీయా ప్రపంచంకూడా ఇప్పుడు ఆమెను ఆకర్షించి - క్షణం తీరుబడి లేకుండా చేస్తున్నవి. అయినా అన్ని సేవారంగాలలోను నడయాడుతూ అరుణ నిర్దుష్టమైన ప్రజాజీవితాన్ని గడుపుతున్నది — ప్రఖ్యాత కాంగ్రెసు సోషలిస్టు నాయకుడు శ్రీ యూసఫ్ మెహరాలీ ఆమె ప్రజాజీవిత ప్రాసస్త్యాన్ని గురించి చెబుతూ: "Strange as it may seem, she combines all the grace and refinement of a

society lady, with the zeal and courage of an earnest revolutionary .... 'Earnest' is perhaps the word that best describes her. She is indeed earnest about whatever she keeps up. There is no nonsence about Aruna...." అన్నాడు.

సాంసారిక జీవితాన్ని గడుపుతూ, సంస్కారయుత మైన విప్లవ భావచైతన్యాన్ని కలిగివుండడమే ఆమెలోని విశిష్టత. తానునమ్మిన దానిని ఆచరించుకొని పోయేపట్టుదల, ఓటమి నంగీకరించని ధైర్యసాహసాలు-ఆమెలోని ప్రత్యేక గుణాలు. కాంగ్రెసు కార్యక్రమ నిర్వహణానికి ఆనాడు ఈ లక్షణాలే గీటురాళ్లు - అరుణ స్వతః ఈ సల్లక్షణ సం పన్నగనుక - ఢిల్లీ రాజకీయ ప్రపంచంలో ఆమె అణి ముత్తెమువలె ప్రకాశించింది.

1930-31 జైలు జీవితం ముగిసిపోయింది ముగిసిన వ్యవధానమే లేదు - తిరిగి 1932 - మరియొక సత్యాగ్రహో ద్యమము - గాంధీజీ, నెహ్రూ, పటేల్, ఆజాద్, సరోజనీ, మొదలగు ప్రముఖ నాయకులంతా "అరెస్టు" అయినారు. ఆసఫ్ అలీ అప్పుడే తిరిగి జైలుకేగినాడు. మరి, అరుణకు కూడా నిర్బంధం తప్పలేదు.

ఈతూరి ఆమెకు జైలుశిక్షమాత్రమే కాక - రెండు వందల రూపాయిలు జుల్మానాకూడా విధింపబడింది. కాని ఆమె జుల్మానాను చెల్లించ నిరాకరించింది. దానిపై ఢిల్లీ పోలీసు అధికారులకు విపరీతపుతెలివితేటలు పుట్టుకొచ్చాయి. రెండువందల రూపాయల జుల్మానాను వసూలు చేస్తుకొన దానికి ఆమె భర్త తాలూకు బ్యాంకులోనున్న సొమ్ముకోనం

పోలీస్ అధికారులు ప్రయత్నించలేదు. పోనీ, అతని ఆర్జన అయిన ఇంటిలోని సామాను జప్తుచేయడానికిన్ని వారు పూనుకొనలేదు. ఆడబ్బును రాబట్టుకొనడానికి ఆమె ఖరీదు గల చీరలను వారు ఎత్తుకుపోయారు!! ఢిల్లీ పోలీస్ అధికారుల నైచ్యవిధానం, మానవ పశుత్వం....ఇంతకంటె హైన్యవిధానాలను ఇంకేమి అనుసరించ గలుగుతుంది? బ్రిటిష్ సామ్రాజ్యపరిపాలనా యంత్రం పవిత్ర భారత భూమిలో ఆచరించిన హీనాతిహీనమైన చర్యలకు, నీచాతి నీచమైన కృత్యాలకు ఇది ఒక మచ్చుతునక!

చీరలను జప్తుచేసి - ఢిల్లీపోలీస్ అధికారులు ఆమెను ఢిల్లీ జిల్లాజైలులో నిర్బంధించారు. ఢిల్లీలో ఒకవిప్లవవాదినిని ప్రజలకు దూరం చేసినాముగదా అని వారు సంతృప్తి చెందారు.—

కాని - అచిరకాలంలోనే ఢిల్లీ డిస్ట్రిక్టు జైలులో ఆమె వలన ఢిల్లీ ప్రభుత్వాధి కారులకు క్రొత్త అవస్థలు చుట్టు ముట్టాయి.—

రాజకీయ ఖైదీల యెడల జైలు పాలకవర్గం చూపుతూవున్న అనాదరణ, నిర్దాక్షిణ్య విధానాల యెడల అరుణ తన అసమ్మతిని తెలియజేసింది. జైలు అధికారులు తమ ప్రవర్తలను మార్చుకొనవలెనని లేనిచో తాను నిరాహార దీక్షపూన నున్నానని కూడా ఆమె వారికి తెలియ పరచింది. కాని ఆఅధికారుల పాషాణహృదయం చలించలేదు. వెంటనే అరుణ ప్రాయోపవేశానికి ఉపక్రమించింది.—

నాల్గు రోజులు గడువగానే - ఆమె ఆరోగ్యం చెడిపోయింది. ప్రమాదకరమైన రుగ్మత ఆమెను లోగొన్నది.

నిరాహారాన్ని మాని, వెంటనే ఆహారం తీసికొనినగాని-ఆరోగ్యం కుదుట పడదని వైద్యులు బోధించారు; కాని అరుణ తన వ్రతభంగానికిసమ్మతించలేదు. నిరాహారము,జబ్బురెంటి వలన అరుణకు ప్రాణాపాయము కలిగే పరిస్థితులు సంభవించాయి. అంతట చేయునదిలేక - జైలు అధికారులు రాజకీయ ఖైదీల కోర్కెలను మన్నించడానికి అంగీకరించారు. అరుణ ప్రాయోపవేశాన్ని సమాప్తిచేసింది. నిర్బంధితులు విజయాన్ని చూరగొన్నారు....కాని అధికారులకు మాత్రం అరుణపై ఆగ్రహం అపరిమితమై పోయింది - ప్రతీకారం చేయనిదే వారికి శాంతి లేక పోయినది.

డిల్లీ జైలునుండి ఆమె వదలిపోవడమే ప్రధానంగా ఎంచుకొని - ప్రభుత్వాధికారులు ఆమెను అచిరకాలంలోనే "అంబాలా" జైలుకు మార్చివేశారు. అంబాలా జైలు "స్త్రీల జైలు" కాదు. స్త్రీలకొక ప్రత్యేకశాఖ అయినా అచట లేదు. - అయినను అధికారులు ఆమె నచటికి మార్చి - ఒక ప్రత్యేకమైన గదిలో - ఎవరికిని సంబంధం లేకుండా— ఏకాంతంగా నిర్బంధించారు.

ఒక దేశసేవికయైన స్త్రీ యెడల ఢిల్లీ ప్రభుత్వాధికారులు ఆచరించిన దురహంకార విధానమిది; స్వార్థబ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనా దుర్నయాలకు అబల - సబల తారతమ్యాలు, స్త్రీ-పురుష విచక్షణలు లేవుగదా!

తదుపరి - రాజకీయ ఖైదీలందరితో పాటుగ అరుణ కూడా అంబాలా జైలునుండి విడుదల పొందినది.—

విడుదల నందినదిగాని-ఆమె ఆరోగ్యము మాత్రము అంత ప్రోత్సాహకరముగాలేదు. మానసికముగాకూడా ఆమె

చాలా దెబ్బతిన్నది. దైహికముగా, మానసికముగా ఆమెకు అసంతృప్తి మిక్కుటమవటమేగాదు - అనాటి రాజకీయాలలో కూడా ఆమెకు అసంతృప్తి ఛాయలు గోచరించినవి. అదొక విసుగుదల, అప్రీతి, నైరాస్యం ఆమెను చుట్టుముట్టినవి. నాటిరాజకీయాలలోనే అప్రీతివున్నదో - లేక తనరాజకీయ పరిజ్ఞానంలోనే అసంతృప్తి వున్నదోగాని - అరుణకు రాజకీయ జీవితమంటేనే ఉత్సాహం నశించింది. ఫలితంగా- జైలునుండి బయటకు వచ్చిన తరువాత ఆమె ఢిల్లీ రాజకీయాలకు దూరంగానే వుండిపోయింది.

రాజకీయాలలో నిర్మాణయుక్తమైన కార్యక్రమం కంటె వాదోపవాదాలే ప్రధానస్థానం పొందివున్నరోజులవి. ఏవేవో కక్షలు, ఏవేవోభిన్నవర్గాలు! విభిన్నసిద్ధాంతాలు—విభిన్నరాద్ధాంతాలు - పార్టీలలో పార్టీలు - ఆశయాలలో అంతరాశయాలు - మితవాదము, అతివాదము, తీవ్రవాదము రాజకీయ రంగంలో కుస్తీలు పడుతున్నవి. వామ పక్షీయుల వాదాలు బలీయములవు తున్నవి. ప్రజా పరిపాలనాశయము, సామ్యవాద సిద్ధాంతము-ధనికవాద ప్రశంస - మూడున్ను రాజకీయ దుమారంలో ఎగురుతున్నవి—

గాంధీవర్గం కొంత - నెహ్రూవర్గం కొంత - కాంగ్రెసులోనే విభాగమొచ్చు చిహ్నాలు ప్రస్ఫుటమైనాయి. కాని అప్పటికి ఇంకా నెహ్రూసామ్యవాద కార్యక్రమం ఒక రూపాన ఏడలేదు. ఒక కార్యక్రమమున్ను దానికి ఏర్పడ లేదు ఆశయాలలో కొంత భిన్నాభిప్రాయం ఏర్పడినా నెహ్రూ గాంధీజీ కార్యక్రమంతో మాత్రం విడిపోలేదు.

అసలు అతడు కాం గ్రెసుకు ఒక నిర్దిష్టమైన సామ్యవాద కార్యక్రమాన్నే సిద్ధపరచలేదు.

అయినప్పటికిని - గాంధీవాదులు కొందరు - సామ్యవాద భావుకులు కొందరు - బయలుదేరారు. కాంగ్రెసు అగ్ర నాయకులలో కొందరైన సర్దార్ వల్లభాయ్ పటేల్, అబ్దుల్ కలామ్ అజాద్, కృపాలాని, పట్టాభిసీతారామయ్య, ఆసఫ్ ఆలీ, రాజేంద్రప్రసాద్, మొదలైనవారు పూర్తిగా గాంధేయు'లైనారు. సామ్యవాదంలో వారికి విశ్వాసంలేదు. కాంగ్రెసులోని వామపక్షీయులు వాదిస్తూవున్న సామ్యవాదసిద్ధాంతాలను వారు హేళనచేసేవారుకూడాను. తమ గాంధీ యిజానికి - ఆసోషలిజానికి వ్యత్యాసంలేదని - గాంధీయిజమ్ భారతీయం అయితే - సోషలిజమ్ పాశ్చాత్యం అని వారు అధిక్షేపించారు. సర్దార్ పటేల్ అంతవాడు కూడా - "సామ్యవాదమంటే - భర్తలను విడిచిపెట్టిన భార్యలకు, పెత్తనం చెల్లని భర్తలకు సరిపడేది....'' అంటూ అపహాస్యం చేయకుండా వుండలేక పోయాడు.

అయితే-తమగాంధేయ సిద్ధాంతాలను గురించి ఇందు మూలంగా ప్రజలకు చెప్పవలసిన బాధ్యత వారిపైబడింది. వెంటనే "ప్రాథమిక హక్కులు - పౌరస్వత్వాలు" అంటూ కొన్ని సూత్రాలను, బీదలఔన్నత్యం కొరకు అంటూ కొన్ని కార్యక్రమాలను, మరి కొన్ని ఆర్థిక విధానాలను నిర్ణయం చేసి వారు ప్రకటించారు. తమ సర్వసమానత్వాన్ని గురించి విశ్వమానవ సోదర భావాన్నిగురించి - పీడిత ప్రజోద్ధరణాకాంక్షను గురించి సుదీర్ఘమైన ఉపన్యాసాలను ఇచ్చేవారు; పేజీలతరబడి రచనలు సాగించేవారు. - కాని - "సామ్య

వాదం" అనేమాటను మాత్రం అంగీకరించేవారు కాదు. కాగా దీనికి విముఖులైన - నెహ్రూవర్గం బాహాటంగానే కాంగ్రెసు పెద్దలను విమర్శించ నారంభించింది. కాంగ్రెసు సమావేశాలలో - ఈ రెండువర్గాల నడుమ తీవ్రమైన పోరాటం చెలరేగుతూ వుండేది.

ఈపోరాటాల ఫలితంగా - అంతవరకు అస్పష్టంగా వుంటూ వచ్చిన సామ్యవాద భావాలు- కాంగ్రెసు రాజకీయాంబరాన - స్పష్టంగానే మెరువ నారంభించాయి! కాని ఆసామ్యవాద రాజకీయాలకు ఒక సరియైన కార్యక్రమము. పథకము మాత్రం ఏర్పడలేదు.

అస్పష్టంగా వుండినప్పటికిని, వాటికై కొన్ని కాంగ్రెసు యువక వర్గాలు అఱ్ఱులుచాచాయి అరుణ వయస్సులోని యువకలోకమంతా ఆ సిద్ధాంతాలవైపు ఆకర్షింపబడింది. విప్లవభావాల పంటలు పండేయువక హృదయాలు. విశాలభావ పూరితమైన ఆశయాలు కల యువలోకం అంతా పూర్తిగా సామ్యవాద ధోరణిలో పడిపోయింది, శ్రీజయప్రకాశ్ నారాయణ్, అచ్యుత్ పట్వర్ధన్, రామ్ మనోహర్ లోహియా, యూసఫ్ మెహరల్లీ - మొదలైన యువక నాయకశ్రేణి ఈ సమయంలో కాంగ్రెసు రాజకీయాలలో అగ్రతలానకు విచ్చేశారు.—

వీరివలెనే - అరుణకూడా సామ్యవాద భావాలకు ఆకర్షించబడింది. కాని ఆ సామ్యవాద సిద్ధాంతాలంటే ? సంపూర్ణ పరిజ్ఞానాన్ని సంపాదించవలెగదా ! అరుణ స్థిర సంకల్పం చేసుకొన్నది. ఆ సామ్యవాద సిద్ధాంతాలను పూర్తిగాతరిచి, స్వీయాశయలను రూపొందించు కొనవలెనని నిర్ణ

యించుకొన్నది. రాజకీయాలను దూరంగా పెట్టి - ఇంటివద్దనే కట్టడిపోయి గ్రంథమథనం మొదలుపెట్టింది. - స్వతః అరుణకు పుస్తక పఠనమంటె మిక్కిలిప్రీతి. దానికితోడు రాజకీయాలను తరిచి, వాటి సారాన్నిగ్రహించవలెననే ఆకాంక్ష జనించినదంటే గ్రంథపఠనం మరీవిపరీతం కావడంసహజం.

ఈ నూతన వ్యాసంగంలో అరుణకు నూతన కాంతులు గోచరించాయి. కాంగ్రెసు కార్యక్రమంలో విప్లవశక్తి తగ్గుతున్నదని ఆమె భావించుకొన్నది. హింసయో, అహింసయో - బ్రిటిష్ పరిపాలనను తుదముట్టించడానికి తీవ్రతరమైన రాజకీయ కార్యక్రమము, జనబాహుళ్యమైన ఉద్యమము - త్వరితగతిని మొనకెత్తుతూ వుండాలని - ఆమె నిశ్చయించుకొన్నది. నైతిక సూత్రాలతో న్యాయవాదాలతో ధర్మయుద్ధంచేస్తే బ్రిటిష్ సామ్రాజ్యవాదం భారతావనినుండి నిష్క్రమించదని - దాని హృదయం పాషాణతుల్యమని ఆమె నిర్ణయించుకొన్నది దెబ్బకు దెబ్బకొడితేనే బ్రిటిష్ జాతి కాళ్ళబేరానికి వస్తుందిగాని- దెబ్బతిని-రెండవ దెబ్బకు రెండవచెంప నిచ్చే ధర్మయుద్ధానికి ఆజాతి హృదయం కరుగదని - ఆమె దృఢనిశ్చయం చేసుకొన్నది. ఆనిశ్చయంతో పాటు - సత్వర స్వరాజ్య సంపాదనకు కొన్నిమార్గాలను, సూత్రాలను కూడా స్థిరపరచుకొన్నది.

ఈ పుస్తక పఠనా వ్యాసంగంలో అరుణ మునిగి వుండగా - సుమారు ఏడేండ్లు దొర్లి పోయాయి —

భర్త ఆసఫ్ ఆలీ కాంగ్రెసు కార్యవర్గ సభ్యుడై కాంగ్రెసు కార్యకలాపంలో కాకలు దేరుతున్నాడు. ఢిల్లీలోని హిందూముస్లిమ్ - సంయుక్త నియోజకవర్గంనుండి ఆతడు

కేంద్రశాసనసభకు అత్యధికమైన ఓట్ల సంఖ్యాబలంతో ఎన్నుకొనబడినాడు. వివిధరాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రాంగాలు పరిపాలనా ఖలీనాన్ని చేతబట్టాయి. 1939 లో ఐరోపాలో ద్వితీయ ప్రపంచమహా సంగ్రామం ఆరంభమైన వెంటనే - ఇచట బ్రిటిష్ యుద్ధాశయాలకు అసమ్మతిగా కాంగ్రెసు మంత్రాంగాలను త్యజించింది. అదే సమయంలో బ్రిటన్‌పై ప్రజాపోరాటాన్ని ఆరంభించవలెనని సుభాష్ బోస్ "ఫార్వర్డు బ్లాకు" ఆందోళన మొదలుపెట్టింది. దేశం గవర్నర్ల పరిపాలనకులోనై పోయింది. నిర్బంధ విధానం దేశరక్షణ పేరిట చెలరేగుతున్నది. గాంధీజీ "యుద్ధానికి భారతీయులు సహాయం చేయకూడ" దన్నాడు. వాక్‌స్వాతంత్ర్యాన్ని నిరూపించుకొనడానికి అతడు "వ్యక్తిగత సత్యాగ్రహాన్ని" ప్రారంభించాడు.

"పోరాటం" కొరకు ఎదురుచూస్తూవున్న కాంగ్రెసు పోషలిష్టువర్గానికి ఇది కొంతవరకు శాంతిని కలిగించింది. అట్టి "పోరాటం" కోసం ఆశపడుతూవున్న అరుణకు చక్కని అవకాశమే లభించింది. జైలుకు వెళ్ళింది. శిక్షాకాల పరిమితి పూర్తి అయిన వెంటనే-ఆమెవిడుదల చేయబడింది.

కాని - ఆమెకు ఈ "పోరాటం"వలన తృప్తికలుగలేదు-చిత్రమేమంటే - ఈతూరి జైలుకు వెళ్లి వచ్చిన తరువాత - ఆమెకు కారాగార కార్యక్రమమంటే రోతపుట్టింది. సమిక్కుటమైన నైరాశ్యంజనించింది - కాని చేయగలుగునది సఏమిన్నీ ఆమెకు అంతలో లభించలేదు. కాని ఆమె నిరాశాగహతకాలేదు. దుర్బలరాజకీయ వాతావరణానికి తన కుశాగ్ర

బుద్ధిని, ధైర్యహృదయాన్ని లోనుగానీక -సమయం కోసం వేచివున్నది.

ఇంతలో "క్విట్ ఇండియా" అని గాంధీజీ ఒకఅపూర్వమైవ పిలుపు ఇచ్చాడు. భూనభోంతరాళాలు దద్దరిల్లె. ఒక మహత్తర సమరం - భారతదేశంలో ప్రారంభం కానున్నదని - స్పష్టంగా ద్యోతకమైంది. అరుణ విప్లవాత్మ పొంగిపోయింది. చిరకాలమనోరథం ఒక్కమాటు ఈడేరే సమయం ఆసన్నమైనదని ఆమె హర్ష పులకిత అయింది; స్వాతంత్ర్య సముపార్జన కొరకు తాను అనుసరించ దలచుకొన్న విధానాలను కార్యరూపాన ప్రవేశపెట్టడానికి ఆమెకు అక్కరాలా తరుణం లభించింది. అరుణ అజేయమైన విప్లవమూర్తినియై ఆ స్వాతంత్ర్య సమరంలో దుమికి అంతర్ధానం అయిపోయింది.—



# 1942 ఆగస్టు - 9

భారత స్వాతంత్ర్యసమరచరిత్రలో - ఈ తేదీ రక్తాక్షరఛాయల లిఖితమవుతుంది.—

ఆగస్టు మొదటివారంలో బొంబాయి నగరం విప్లవ-గాడ్పులతో ఉడుకులెత్తి సాగింది. అఖిలభారతకాంగ్రెసు కమిటీ సమావేశానికి - అఖిలభారతజాతీయనాయకు లందరూ అరుదెంచారు. బొంబాయిలోని "గోవాలియా"చెరువు మైదానంలో కాంగ్రెసు కార్యవర్గ సమావేశానికి, అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశానికి— బ్రహ్మాండమైన ఏర్పాట్లుచేశారు.— కాంగ్రెసువాదులేగాదు - స్వాతంత్ర్యా కాంక్షులగు ప్రజలుకూడా - ఆసమావేశానికి వేలాదిగ ఆగమించారు.

భారత భాగ్యవిధాత బాపూజీ - అంతకు పూర్వమే కాంగ్రెసు సారధ్యాన్ని స్వీకరించారు. స్వాతంత్ర్య సముపార్జనకై అంతిమ పోరాటాన్ని నడుపడానికి గాంధీజీ సర్వ సన్నద్ధుడై వున్నాడు. ముందుగానే - "క్విట్ - ఇండియా" సమరనినాదాన్ని దేశజుల కందిచ్చినాడు. ఆనినాదాన్ని రూపించే తీర్మానాన్ని కాంగ్రెస్‌చే ఆమోదింప జేయడము, తదుపరి భారతరాజ ప్రతినిధితో మాట్లాడటము - అంతట

అవసరమైనట్లయితే - సార్వజనీన సత్యాగ్రహసమరాన్ని ప్రారంభించడము - జరుగనున్నదని - తెలియగానే ప్రజలు సమరోత్సాహులై బొంబాయి నగరానికి ఉరికినారు.—

విజయమో ! వీరస్వర్గమో ! ! ఏదో ఒకటి-అన్యధ్యాస లేదు; అన్యకార్యక్రమంలేదు. ఈ మార్గమువినా భారత స్వాతంత్ర్య సంపాదనకు అన్యశరణ్యం నాస్తి ....ఈభావనా జనితమైన మహోద్రేకంలో - కాంగ్రెసు సభాపరణం అంతా ప్రజాసముద్రమై పోయింది. - అగ్రనాయకులు తీవ్రమైన చర్చలు జరుపుతున్నారు. తదితర నాయకులు ప్రజలకు సముచితమైన హెచ్చరికలు చేస్తున్నారు.

భర్తసమేతంగా-అరుణా ఆసఫ్ ఆలీ కూడా ఆసమావేశానికి విచ్చేసింది. - ఆ సువిశాలమైన సభావరణలో ఆమె ఇటు అటు నడయాడుతూ _ఏదో అఖండమైన కార్యభారాన్ని నిర్వహించ బోతూవున్నట్లు-యువజనులతో ఏమేమోచర్చలు జరుపదొడగినది: పాతస్నేహితులను పరామర్శించడము, కొత్త మిత్రులను కలుసుకొనడము -తూనీగవలె ఆమె అటు ఇటు తిరుగుతూ _ అత్యవసర కార్యక్రమాన్ని దేనినో నిర్వహించు కొనసాగింది.

అంతవరకు "తీవ్రతర పోరాటం'' కొరకు ఆందోళనచేస్తూ వచ్చిన కాంగ్రెసు సోషలిస్టుపక్షం - ఆ ఆందోళనను ఆపివేసి - కార్యరూపాన పోరాటాన్ని ఏ విధంగా సాగించవలెనో - అట్టిదాని అన్వేషణలో నిమగ్నమై వున్నది. కాంగ్రెస్ సభావేదికకు ఎడమప్రక్క - ఓమూలకూర్చుని, సోషలిస్టునాయకులు లోహియా, పట్వర్ధన్, అశోక్ మెహతా మొదలైన వారితో అరుణా ఆసఫ్ఆలీ ఏవోగాఢమైన

చర్చలు చేస్తున్నది. ఆమెతో పాటు ఉషామెహతా, ఆలీస్ ఆల్వార్స్ - మరి కొంతమంది యువతీమణులు కూడా ఆ చర్చలలో పాల్గొంటున్నారు.—

—కాని—సభాసమలకు వీరి గొడవేలేదు - వీరి ప్రసక్తియేలేదు - ఎవరను కుంటారు? ఆ మరునాటి నుంచి - వారందరు ఒక వినూత్నచరిత్రను రచించబోతారని, ఒక మహనీయ సమరానికి సారధ్యం వహించ బోతారనీను....!

ఎనిమిదవ తేదీ రాత్రి చాలసేపటివరకు కాంగ్రెసు నాయకుల సమావేశం జరిగింది. "క్విట్ఇండియా" తీర్మానం ఏకగ్రీవంగా జయజయధ్వానాలతో ఆమోదింపబడింది. రహస్యసమావేశంలో - గాంధీజీ - తాను ప్రారంభింపనున్న మహా సమరాన్నిగురించి - అహింసాయుతంగా ఆ సమరాన్ని ఏయే పద్ధతులలో సాగించవలసి వున్నదో ఆయా వివరాల్ని గురించి చర్చించినాడు. వెంటనే రాజప్రతినిధికి ఆ "క్విట్ ఇండియా" తీర్మానం విషయమై ముఖాముఖి చర్చలు జరపడానికి ప్రజాప్రతినిధిగా తాను వస్తున్నానని— అందుకు అవకాశం ఇప్పించవలసినదని - కోరుతూ తంతి నిచ్చాడు. సమావేశం రాత్రి బాగా ప్రొద్దు పోయిన తరువాత ముగియడం వలన నాయకులు విశ్రాంతి స్థలాలకు - స్నేహితుల గృహములకు వెడలిపోయారు—

తొమ్మిదవ తేదీ ఉదయం - మామూలుగానే తెల్లవారింది. - కాని మామూలు కళ లేదా ఉదయానికి. ప్రజలు ఏదో ఆందోళనగా పరువులిడుతున్నారు. "టెలిఫోన్" యంత్రాలు ఎచ్చటను పనిచేయడంలేదు. ఒకరి నుండి వేరొకరికి కబురు చేరటంలేదు. అంతా గందరగోళంగావుంది.

"నాయకులను తెల్లవారు ఝాముననే నిద్రనుండి లేపి, అరెస్టుచేసి, ఎక్కడికో తీసుకొనిపోయారు ...."

ఈ వార్త నగరమంతటా అలముకొన్నది ప్రజలు ఆగ్రహావేశులై, కర్తవ్యతామూఢులై ప్రభుత్వంపై తిరగబడ్డారు. కొన్ని పేటలలో అల్లరులు అప్పుడే ఆరంభమైనవి.

"గోవాలియాటాంక్" మైదానంలో జాతీయ పతాక ప్రతిష్ఠాపనా మహోత్సవం! ఆమహోత్సవానికి అరుణ అధ్యక్షత వహించింది. పతాకవందనాన్ని గైకొనడానికి ప్రజలు తండోపతండాలుగా గుమికూడారు. ఇంతలో సాయుధ పోలీస్ దళం అటకు చరచరా వచ్చింది....మరి కొంత సేపటికి శ్రీమతి కస్తూరిబా అరెస్టయింది, వెంటనే మనిబెన్ పటేల్ నిర్బంధింపబడింది. ప్రజలలో కలకలం బయలుదేరింది. గుంపులను చెల్లాచెదరు చేయడమే పోలీస్ అధికారులు పనిగా పెట్టుకొన్నారు. ప్రజాసమూహం తిరగబడింది. పోలీస్‌లు లాఠీలు ప్రయోగించారు: బాష్పవాయువును వదలి ప్రజల కండ్లను అశ్రుపూరితాలను చేసి తాత్కాలిక మతిభ్రమణం కలిగించారు. తుపాకీ గుండ్లను పేల్చి ప్రజలను బలిగొన్నారు "కొట్టడము - తిరగపడితే చంపడము" ఇదే ఆసాయుధ పోలీసుల కానాటి ప్రభుత్వాజ్ఞ !

అరుణ వేదిక దిగింది. ప్రజలలో కలిసిపోయింది. స్వీయ రక్షణను సరకు గొనకుండా గాయపడినవారిని తీసికొని పోవడంలో - ప్రజలను సరియైన మార్గాలకు మళ్ళించడంలో - నిమగ్న అయింది. తొడత్రొక్కిడి - హాహాకారాలు - పచ్చిరక్త ప్రవాహం....! ఆరక్తం! నిర్దోషుల వేడిరక్తం! ఆ తుపాకీ గుండ్ల టపటప ధ్వనులమధ్య-అరుణ

హృదయం కంపించి పోయింది. రక్తానికి బదులుగా రక్తాన్ని చూడవలెనని - ఆమెలో విప్లవభావం ఉవ్వెత్తున పొంగింది. అదే - ఆమె ఒక విప్లవమూర్తి కావడానికి - విప్లవ రాజకీయాలను వరించడానికి ఉత్తేజపరచినమొదటి పాఠం ప్రథమ మంత్రోపదేశం ..!!

ప్రజలు చెల్లాచెదరై పోయారు. అరుణ అగుపడలేదు.....

మరి, ఆమె ఎచటకు అదృశ్యమై పోయిందో! "అరెస్టు వారంటు"ను పట్టుకొని - పోలీసు అధికారులు ఆమైదానమంతా కలయ వెదికారు. పీనుగులను పరీక్షించారు. అవధ్యులను పరికించారు. పరిసర గృహాలను సోదాచేశారు. నిరాశాహతులై తమ తమ "స్టేషన్లకు" తరలిపోయారు.

అరుణ అదృశ్యమై పోయింది—

ప్రభుత్వాధికారులకు మతి చెడిపోయింది.—

ఆ విప్లవ వీరనారిని బంధించక పోతే-తమ సామ్రాజ్యాన్ని అగ్నిగుండలో వుంచుకొనడమే అని ప్రభుత్వం తీతిలి పోయింది.

అరుణ పరారీఅయినది "ఆమెను పట్టుకొని అప్పగించినవారికి 5,000 రూపాయిల బహుమానం"అంటూ పర ప్రభుత్వంప్రకటించింది. దేశంలోనలుమూలలా పోలీస్‌శాఖకు అరుణ జాడకనుగొనడం ఒక ప్రధాన కృత్యమైపోయింది. ప్రభుత్వరహస్య పోలీసుసిబ్బంది - ప్రతి పట్టణంలోను, అనుమానమున్న ప్రతి గ్రామంలోను గాలించివేశారు. కాని అరుణ ఆోగట్టా అంతుచిక్కలేదు—

ఆమె మామూలుగా విప్లవవాదిని అను మాట అటుంచినా - ముఖ్యంగా ఆమె పారిపోవడం ప్రభుత్వానికి గుండె బెదురు కలిగించింది. పైగా ప్రపంచ యుద్ధం ఆనాడు బ్రిటన్ పరంగా బహుప్రమాదకరంగా నడుస్తున్నది. అటు జర్మన్ సేనాని రోమెల్ ఈజిప్టు సరిహద్దుల్లో చొర బడ్డాడు - ఇటు అస్సాం పొలిమేరల్లో జపాన్ సైన్యాలు పొంచివున్నాయి. ఒకవంక సుభాస్ చంద్రబోస్ అక్షరాజ్యా లలో ఓడిసి వున్నాడు, ఇటుదేశంలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ 'శత్రురాజ్యాలతో లాలోచీ' పడుతున్నదనే అనుమానం ప్రభుత్వాధికారులను పీడిస్తున్నది. ఇన్ని ప్రాణసంకటాలు ముప్పిరి గొనగా - బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, మతిచలించి, శత్రులెవరో, మిత్రులెవరో, తెలిసికొనజాలని విషమా వస్తకు లోనై పోయారు.

ఇట్టి సమయంలో - బ్రిటిష్ప్రభుత్వ పెద్దలను ఇది వరకే ఓ ఊపుఊపిన - అరుణ - పరారీ అయినది. ఢిల్లీ ప్రభుత్వ తాబేదారులకు గుండెలు జారిపోయినవి.

వెంటనే - ఆమెపై మూడు నేరాలను బనాయించారు: ఒకటి: అరెస్టువారంటు. రెండు: పట్టుబడకుండా పారి పోవడం, మూడు. రాజద్రోహకరమైన చర్యలు; ఈ మూడు నేరాలను ఆరోపించి "వెంటనే వచ్చి ప్రభుత్వవశం కావ లెను" అంటూ ఒక ఉత్తరువును - ఢిల్లీలోని ఆమె స్వగృహ మైన 'కుచాచలాన్' గోడలపై అంటించారు. అయినా అరుణ వారికి లొంగిపోలేదు. - కొన్నాళ్లదాటిన తరువాత ప్రభుత్వము ఆమెపై మరొక ప్రకటనచేస్తూ ఢిల్లీలోని స్వగృహాన్నిదాటి బైటకు పోకుండావుండే షరతుపై - ఆమె

పై గల నిర్బంధపు టుత్తరువు లన్నిటిని ఉపసంహరించ గల'మని ప్రతిపాదించింది. కాని దీనికిసి అరుణ ప్రలోభ పడలేదు.

పైగా - ఆ ఉత్తర్వును విని - ప్రభుత్వాధి కారులకు భారత దేశంలో ఒకచోటునుంచి జవాబువ్రాస్తూ.... "ఈ క్రొత్త ప్రతిపాదనచేసి నన్ను మీరు అగౌరవ పరిచారు" అంటూ ప్రత్యుత్తర మిచ్చినదని - ప్రభుత్వపెద్దలు ఖిన్నులై తలలు వంచుకొన్నారని - ఒక ప్రతీతి!

ఇది ఒక వదంతిమాత్రంగా వుండినప్పటికి 'అరుణ' విషయమై ఇది ఆశ్చర్యజనకం మాత్రంకాదు.

అరుణ ధైర్య విలసిత. సాహస సంపన్న. ఇట్టి నీచ ప్రతిపాదనలకు ఆశపడి, సోదర దేశభక్తుల ఆశయాలకు అన్యాయంచేయు తత్వం కాదామెది. అది తన గౌరవానికి దేశగౌరవానికికూడా ఆత్మహత్యాసదృశం కాగలదు. సాహసి కకాన - తానా పనిచేయకుండటమే గాక - ప్రభుత్వాధికారులకు చెంపపెట్టు పెట్టినట్లు ప్రత్యుత్తర మీయ గలిగింది.

అయినా ప్రభుత్వ సి ఐ. డి. సిబ్బంది - ఆమెను పట్టుకొనుటకై అహర్నిశలూ తాపత్రయ పడటం విరమించ లేదు. ఆమెను భయపెట్టనెంచి - ఆమె ఇంటిని వేలం వేశారు: కారును జప్తుచేశారు. 'నా' అను దానిని ఆమెకు ఏమియులేకుండా చేసివేసినారు. అయినా అరుణ భీరువు కాలేదు.

అధికారులకు అంతు తెలియకుండానే ఆమె అజ్ఞాత వాసం చేయసాగింది. శిరాధార నిరంజనంగా - ఉన్నచోట

వుండక, పండుకొన్నచోట పండుకొనక-ఆమె ఎట్లుతిరిగినదో ఊహాతీతమైనది. 'ఊరూరా. వాడవాడలా రహస్యపోలీస్ సిబ్బంది వేయికన్నులతో ఆమెకై వెతుకుతున్నది. అను క్షణ ప్రమాద భరితమైన జీవనము- ఒక రోజుగాదు, రెండు రోజులుకాదు - ప్రభుత్వాంక్షలు అమలు నందున్నంత వరకు అనిర్దిష్టమైన కాలమంతా అట్లుగడుపవలె. అరుణ ఈకష్టాల నన్నిటిని సంతోషంతో స్వీకరించింది.

కాంగ్రెసు సోషలిస్టుపార్టీ - ప్రముఖనాయకు లందరు అంతర్ధానమైనారు. వీరందరు ఒకచోటనే వున్నారా ? లేక వేరు వేరుగా తిరుగాడు తున్నారా?- ఈ సమస్యకూడా ప్రభు త్వానికి నమలరాని నారికేళం అయినది.

"క్విట్ ఇండియా'' తీర్మానం ఆచరణలోకి రాలేదు. గాంధీజీ నిర్దేశించిన కార్యక్రమ మేమిటో తెలియదు. అసలు పోరాటం ఆరంభమైనదో, లేదో కూడా - అంతా అగమ్య గోచరంగా వున్నది. అయినా - ఉద్యమం ప్రారంభమైనట్లే తలచి - సోషలిస్టు నాయకులు తమ తమ కార్యకలాపాదు లను "భూగర్భంలో'' నుండియే ప్రారంభించారు.

ఆగస్టు అనంతరం జరిగిన సంఘటనలన్నీ - "నాయ కుల నందరిని నిర్బంధించిన దానికి ఫలితంగా క్రోధోన్మత్తు లైన ప్రజలు జరిపినవే'' అనునది ఒక నగ్నసత్యం. కాని ఆకృత్యాలలో కొన్నింటితో కాంగ్రెసు సోషలిస్టు పక్షానికి పూర్తిగా సంపర్కమున్నది. - అసలు ఆ సామ్రాజ్య నిరో ధక సమరాన్ని' సోషలిస్టు వర్గమే అప్రతిహతముగా నడిపినది.—

నాయకుల నందరను బొంబాయి పోలీసు అధికారులు "అరెస్టు" చేశారు. కాని - వివిధరాష్ట్రాల నుంచి మహాసభలకు విచ్చేసిన నది, పన్నెండుగురు "వర్కర్లు" అరెస్టు కాకుండా మిగిలిపోయారు. వీరికి కాంగ్రెసులో బాధ్యతాయుతమైన పదవులున్నవి. నిర్బంధింప బడకుండా వుండినందున - వీరికి 1942 - ఆగస్టు 8 వ తేదీనాటి "క్విట్ ఇండియా" తీర్మానాన్ని అమలు జరుపవలెనని అభిలాష కలిగింది. అట్టి కోర్కెతోనేవున్న వేలకొలది కాంగ్రెసు సేవకులు దేశమంతటా "పోరాటం" కొరకు ఎదురెదురుచూస్తూవున్నారు. వెంటనే - సోషలిస్టు నాయకులు - తమకు ఉచితమని తోచిన కార్యక్రమాన్ని ప్రజలకు అందిచ్చినారు. సామ్రాజ్యరాక్షసశక్తులు అమాయక ప్రజలపై విజృంభిస్తూవుంటే వాటిని నిరోధించడము, భారతదేశ సరిహద్దులను దాటించి వాటిని తరిమివేయడము - ఇవే వారి ప్రధాన విప్లవాశయాలు.

వెంటనే - వారు అధికారుల కన్నులగప్పి - తప్పించుకు పోయారు. ఎక్కడికి పోయినారో, ఏమో - దినదినము కాంగ్రెసు పేరిట ఉత్తర్వులు, అజ్ఞాపనలు, విజ్ఞాపనలు, జాహిర్నామాలు, రోజువారీ హుంషారీలు వెల్లువలువలె ప్రచారంలోకి వస్తున్నవి. "కాంగ్రెస్ రేడియో"అను పేరుతో ఒక రహస్య రేడియోకేంద్రంకూడా పనిచేయసాగింది. దాని ద్వారానే ఈ నిరోధక యుద్ధకార్యకలాపమంతా ప్రసారమైనది.

"స్వతంత్ర ప్రజలగా ప్రవర్తించండి" అంటూ కాంగ్రెస్ మహాసంస్థ ప్రజలకిచ్చిన ఉపదేశానికి అనుగుణంగా

ఒక మహోన్నతమయిన విప్లవశక్తి ప్రజలలో నుండియే పుట్టుకువచ్చి - ఈ కార్యక్రమానికి హృదయ పూర్వకమైన స్వాగతం ఇచ్చింది. ఈ నిరోధక సమరం - కొంతకాలం పాటు అజేయంగా నడిచి పోయింది తెల్లదొర తన పు మాయోపాయలను, కుతంత్రాలను కూడా అధిగమించిన పోడిమితో ప్రకాశించింది.

రవాణా సౌకర్యాలను విచ్ఛిన్నం చేయడము. టెలిగ్రాఫ్ స్థంభాలను తీగెలను తెగనరుకడము, రైల్వే రహదారులను వ్యత్యస్థం చేయడము. వంతెనలను పడగొట్టడము సాంఘిక బహిష్కారాన్ని తీవ్రతరంచేయడము మొదలైన సకలకార్యక్రమాన్ని సాగించడానికి సోషలిస్టుపార్టీ నిష్కర్షయైన ఉత్తరువుల నిచ్చింది.

పరారీ అయిన ఆదేశభక్తులు నడిపిన రహస్యోద్యమపు వివరాలు - ప్రభుత్వ "సెన్సార్ పద్ధతి" వలన పూర్తిగా తెలియ రాలేదుగాని - కర్ణాకర్ణిగ వినవచ్చినవి. పత్రికా ముఖాన ప్రచురణ నందినవి-కొన్ని ఉదంతాలు లేకపోలేదు.

ఉద్యమం ఆరంభంలో ప్రజలు చేసినదంతా తమకు తామై స్వతస్సిద్ధంగా చేసినదేగాని - పైనుండి ఎవరోపంపిన ఉత్తర్వుల ననుసరించి జరిగినది మాత్రంకాదు కాని ప్రభుత్వ దమన విధానానికి గురియై ఆఉద్రేకము త్వరలోనే చల్లబడసాగినది ఇంతలో పరారీఅయిన దేశభక్తులు ఢిల్లీలో సమావేశమై - ప్రజల ఉద్రేకవహ్నిని పునరుద్దీపింప జేయడానికి చేయవలసినదేమిటి? అనితీవ్రంగా ఆలోచనలుచేశారు. దేశాన్ని కొన్నికొన్ని మండలాలుగా విభాగించి-ఒక్కొక్క మండలంలో నిరోధకసమరాన్ని నిర్వర్తించవలసిన, బాధ్యత

నంతా ఒక్కొక్క దేశభక్త బృందానికి వప్పగించారు. ఆ ఉద్యమానికి వలసిన ఆర్థిక సహాయాన్ని అంతను బొంబాయి చేసింది. బీహారురాష్ట్రం ఆనాటిరణరంగంలో ప్రధాన స్థానం అలంకరించింది. అందువలననే ఇతర రాష్ట్రాలు అన్నిటికంటె బీహారురాష్ట్రం ప్రభుత్వపీడనకు అధికంగా గుఱికావలసి వచ్చినది.

ఆనాడు భారతరాజ ప్రతినిధిగా వుండిన లార్డు లిన్‌లిత్‌గోపైన బాంబు వేయాలని ఈ రహస్యోద్యమ నిర్వాకులు ఒకతూరి ప్రయత్నించారు. లార్డ్ లిన్‌లిత్‌గో ఒకనాడు ఒక సినీమాను చూడడానికి ఒకానొక సినిమాహాలుకు వస్తాడని తెలుసుకొన్నారు. అతనిపై ప్రత్యేకంగా ఏర్పరచబడిన ఆసనంక్రింద ఒక "టైంబాంబు"ను వారు పెట్టారట. కాని-లార్డ్ లిన్‌లిత్‌గో - అదృష్టవశాత్తూ - ఆసినీమాకు కాకుండా వేరొక సినీమాకు వెళ్ళడం తటస్థించింది. ఆ విధంగా అతనికి ఆగండం తప్పి పోయింది.

మరియొకతూరి; అనాడు భారత సర్వసేనానిగా వుండిన లార్డ్ వేవెల్‌సుకూడా చంపడానికి వీరుప్రయత్నించారు. ఢిల్లీనుండి బొంబాయికి లార్డ్ వేవెల్ ఒక ప్రత్యేక రైలు బండిలో వెళ్ళనున్నాడని వారికి తెలిసింది. అంతట రైలు పట్టాలను, మార్గాన్ని కాపలాకాసే రైలుబండిని పోనిచ్చి, వెనుక వచ్చుబండి లార్డ్ వేవెల్ వున్నబండి అనితలచి వెంటనే పట్టాలమీద ఒక "డైనమైట్"ను పెట్టారు. కాని అది ఆతడున్న రైలుబండికాదు; అదిన్నీ మరియొక కాపలాబండియే. అంతట ఆ "డైనమైట్" పేలిపోవడము, బండి

దెబ్బతినడము జరిగింది. ఈసంగతి తెలిసి అతని ప్రత్యేక రైలును వేరొక మార్గాన బొంబాయికి చేర్చారు.

ఈ రహస్యోద్యమ కారులకు కావలసిన ఆయుధాలన్నీ రాజపుటానా సంస్థానంనుండి రవాణా అవుతూవుండేవట! ఒక భారత సంస్థానంలో వీరు ఒక ఆయుధ కర్మాగారాన్ని కూడా నిర్మించి పనిచేశారట! ఆ సంస్థానపు పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ భవనంవద్ద వీరు ఒకనాడు ఒక బాంబును విసిరారు. దానితో అకర్మాగార నిర్మాతలు ఇరువది నాల్గు గంటలలో ఆ సంస్థానాన్ని విడిచివెళ్ళి పోవలసి వచ్చినదట!

ఆ రోజులలో భారత దేశమందున్న కొందరు విదేశీయ సైనికులు కూడా రహస్యోద్యమ విప్లవ కారులకు ఆయుధాలను ఇచ్చి వున్నారట. రైఫుల్, పిస్తోళ్లు, రెండు టామీగన్లుకూడా వారు సంపాదించ గలిగారట.

మరి కొందరు విదేశీయులు వారికి "ఫీల్డుట్రాన్స్మిటర్"ను కూడా ఇచ్చినారట! విదేశ ప్రభుత్వాల సహాయాన్ని సంపాదించాలనే సంకల్పంతో శ్రీ జయప్రకాశ్ నారాయణ్ నేపాల్ సంస్థానం మీదుగా రష్యావెళ్ళదలచినాడని ఒక వదంతి కూడా వ్యాపించింది. కాని అతని యత్నం నెరవేరలేదు.

ప్రధానులగు నాయకుల ఆజ్ఞలను పాలించడానికి దేశం అంతటా షుమారు మూడు, నాలుగు వేలమంది ఉద్యమకారులు వుండేవారని అంచనా వేయబడింది. పోలీసులు, రహస్య పోలీసులు కొందరు ఉద్యమ కారులకు ప్రభుత్వపు రహస్యవార్తలను అందించి వారు నిర్బంధింప బడకుండా

తప్పించుకొని పోవడానికి తోడ్పడి వున్నారవి కొన్ని వదం తులు పొక్కినవి.—

ఇట్టివే మరికొన్ని ఉదంతాలు కూడా లేకపోలేదు. ఆ వివరములన్నీ ముస్ముందు చరిత్రకారుడు లిఖించకపోడు. ఏది ఏమైనప్పటికి ఇట్టి రహస్యోద్యమ సంఘటనలతో ఇంచుమించుగా ఒక సంవత్సరం పాటు భారతావని అంతా అరాచకమై పోయింది. వేలాది ప్రభుత్వ కార్యాలయాలు, తపాలా కచేరీలు దగ్ధపటలమై పోయినవి.

వందలకొలది ప్రభుత్వోద్యోగులు హింసల పాలైనారు. ప్రభుత్వం ముష్కరంగా ఈ నిరోధక సమరయోధులను ఎదుర్కొన్నది; తుపాకులు, ఫిరంగులు మాత్రమేగాక విమానాలపైనుండికూడా మరతుపాకుల నుపయోగించి ప్రభుత్వం వేలకొలది ప్రజలను పొట్టను పెట్టుకొన్నది. ప్రభుత్వ ప్రతీకారానికి గురియై షుమారు యాభై వేలమంది వరకు ఈ ఉద్యమంలో మరణించి వుంటారని ఊహించబడుతున్నది.

మిడ్నపూర్ జిల్లాలో కొన్ని వారములపాటు భారత "స్వతంత్ర ప్రభుత్వం" కూడా కొనసాగినదంటే - శోషితప్రపక్షం ఎట్టి అపురూపమయిన అమరమయిన స్వాతంత్ర్య యుద్ధాన్ని సాగించినదో - ఆశ్చర్యం కలుగక మానదు.—

ఇంతలో గాంధీజీ విడుదలనంది- ఆగస్టు అల్లరులను ఖండించినాడు. రహస్యోద్యమాలను విమర్శించాడు. కాంగ్రెసుకు ఆ ఉద్యమాలకు ఎట్టి సంబంధమూలేదని- రహస్యంగా తిరుగుతూ వున్న విప్లవనాయకులను ప్రభుత్వానికి నిర్నిబంధంగా వశపడవలసినదని హెచ్చరిక చేశాడు.

ప్రచ్ఛన్నంగా తిరుతుతూ బ్రహ్మాండమయిన నిరోధక యుద్ధాన్ని నడుపుతూ - కాంగ్రెసు సోషలిస్టు నాయకులు ఈ విధంగా ఒక సంవత్సరంపైగా సంచరించారు. కాని కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ప్రధాననాయకుడు శ్రీ జయప్రకాశ్ నారాయణ్, రామ్మనోహర్ లోహియా ప్రభృతులు- ఉషా మెహతా, అనీవ్ ఆల్వార్స్-వీరనారీమణులు రహస్యపోలీసు లకు చిక్కిపోయారు. ప్రతీకారోన్మాదయైన ప్రభుత్వంవారిని చీకటి కొట్లలో బంధించి, హింసించింది. అన్నపానాదుల నీయక పీడించింది. సకలయమయాతనలకు గురిచేసింది.

ఈ సందర్భంలో భారత కమ్యూనిస్టుపార్టీ నడవడిని ఏభారతజాతీయవాదియును హర్షించలేడు. 'ప్రజాయుద్ధం' అను నినాదాన్ని లేవనెత్తి - తమపార్టీపై గల ఆంక్షలను రద్దుచేయించుకొని - వీరు ప్రభుత్వంతో కలిసిపోయ్యారు. ప్రభుత్వంవద్ద డబ్బుతిని - ప్రభుత్వపాలకులకు అమ్ముడు బోయారు. రహస్యోద్యమ నాయకులను పట్టి, ప్రభుత్వరాక్ష సులకు వప్పజెప్పారు. రహస్యోద్యమ వృత్తాంతాలను ఎరుక పరుస్తూ సామ్రాజ్యవాదులకు "ఏజంట్లు" ఐ కేవలము "గులాములై"— దేశద్రోహానికి ఒడిగట్టినారు. ఆగస్టు ఉద్యమాన్ని ధిక్కరించడానికి ప్రభుత్వం ఎంతబలాన్ని ఎదురొడ్డినదో - కమ్యూనిస్టులు అంతగా దానికితోడ్పై, దేశ ద్రోహము, ప్రజాద్రోహము, స్వాతంత్ర్య విద్రోహము చేసి నారు. ఈ అంతశ్శతువులు ప్రభుత్వానికి తోడ్పడివుండని పక్షంలో—ఆఉద్యమం అంతలో అపజయమందెడిది కాదు. ఆధునిక భారత స్వాతంత్ర్య చరిత్రలో ఈ మాతృదేశ

ద్రోహులు - నీచాతినీచలుగా వర్ణింపబడుతున్నారు. తత్ఫలి తాన్నికూడా వారు అనుభవింపకుండా వుండరుగదా !

'ప్రాణాన్ని కూడా పణంగా పెట్టి - స్వాతంత్ర్యం కోసం పోరాడడమే' వారొనర్చిన మహాపరాధం! వీరే - ఏ పాశ్చాత్య దేశజులైనను అయినట్లయితే - ప్రజలు ప్రభుత్వము వారిని అందల మెక్కించి వీరపూజలుచేసి వుండెడి వారు కాని భారత భూమిని పరిపాలించుచున్నది భారతీయ ప్రభుత్వముగాదు! పరాయి పాశ్చాత్య పశు ప్రభుత్వము ! దానివద్ద దేశ భక్తికి తావులేదు. దేశభక్తునకున్ను అచట చోటులేదు. "రాజభక్తి"కే దాని పజ్జ పూజ్యత వున్నది. రాజభక్తి పరాయణునకే అచట గణ్యత వున్నది. "దేశ భక్తి - రాజభక్తి" రెంటికిని పాశ్చాత్య స్వతంత్ర దేశాలలో రూపబేధంలేదు. అర్థం బేధంలేదు. కాని ఈ అస్వతంత్ర భారతావనిలో, ఆ పదాలు పరస్పర విరుద్ధాలు అచట అవి అచట అక్కచెల్లెళ్లు - ఇచట అత్తా కోడళ్లు"

గాంధీజీ ఆదేశానుసారం కొందరు ప్రచ్ఛన్న సోషలిస్టు నాయకులు - పోలీసులకు తమంత తామే లొంగిపోయారు.

కాని - అరుణ మాత్రం ప్రభుత్వానికి దాసోహమన లేదు. ప్రతిక్షణా పాయకరమైన అజ్ఞాతవాసాన్నే ధీర చిత్తంతో నిర్వహించు కొన్నది. ఇది యదార్థంగా బృహత్కార్య సాధనయే. కాకపోతే - సి. ఐ. డి. పరిపాలనలో కుతంత్రరాజ్య నిర్వహణలో ఆరితేరిన బ్రిటిష్ సామ్రాజ్య శక్తిని - షుమారు మూడు సంవత్సరాలపాటు మూడు చెరువుల నీరుత్రాగించి - కనుగప్పి, ముప్ప తిప్పల బెట్టి - తాను

సాముతో దాగుడుమూతలాడిన శక్తి సామర్థ్యాలు, ధైర్య సాహసాలు, అరుణకు కాక ఆధునిక చరిత్రలో మరెవరికి కలిగినవి?

ఈనాడు ఇచ్చట, రేపు ఇంకొకచోట - నేడుఒకపేరు రేపు మరొకపేరు, నేడొక వేషం రేపుమరొకవేషం. నిరాహారపు దినములెన్నో - మరినిదుర రాత్రులెన్నో ప్రచ్ఛన్న జీవితంలో ఆవీరనారి ఎట్లుగడపినది మరేమి చేసినది ఆమెయే చెప్పవలసినది - కాని ప్రచారంలో కొన్ని "కథలు" లేకపోలేదు—

అరుణకు ఒకసారి అనారోగ్యం సంభవించింది. రక్తవిరేచనాలతో ఆమె బాధపడుతున్నది. రోగపీడనకు గురియై ఆమెచిక్కి శల్యమైపోయింది. గుర్తు పట్టలేనంతగా పూర్వరూపానికి ఒకకీనీడవతుగా మారిపోయింది. దీనికితోడు రక్తక్షీణత లోలోన పెరిగిపోతున్నది. ఆమెతాత్కాలికంగా తలదాచుకొన్న మిత్రుని ఇంటిలోని వారందరు ఆమెపరిస్థితికి చాల కలతజెందారు. రోగనివృత్తి అగుసరకు వుండి వెళ్ల వలసినదిగా ఆ మిత్రుడెంత ప్రాధేయపడినా ఆమెకు సమ్మతంకాలేదు. కాని ఆమెతోడి అజాతవాసులగు మిత్రులు ఆమెను బలవంత పెట్టినారు. ఎట్టకేలకు ఆమె అందుల కంగీకరించక తప్పలేదు. ఆ మరుసటి రోజుననే మరొక గండం సంప్రాప్తమైనది. ఆమె మిత్రునికి ప్రాణ స్నేహితుడగు ప్రభుత్వ ఉన్నతోద్యోగి ఒకడు తాను వస్తున్నట్లుగా ముందు తెలియపరుచకుండానే - అతనిఇంటికి అరుదెంచాడు చిరకాలపు ఆప్తమిత్రుడు, కనుక అతడు తిన్నగా ఇంటిలోనికి ప్రవేశించాడు లోనికివచ్చి. ప్రథమ

తరగతి విప్లవకారిణి - అరుణ'ను చూచి చకితుడై నిలబడి పోయాడు. అరుణ మిత్రుడు ఈ సంఘటనలను చూచి అచేతనుడై పోయినాడు. గృహములోని తదితరులు నిచ్చేష్టులైనారు. కొంతవడి ఆ ఇంటసర్వమూ స్థంభించి పోయినట్లయినది. ఏదో 'భీతి' విద్యుద్వేగంతో అందరినీ అలుముకొన్నది. కాని అరుణతొణకలేదు, బెణకలేదు. నిర్భయంగా నిశ్చలంగా ముందుకు వచ్చింది. ఆ ఉన్నతోద్యోగిని ఆహ్వానించి ఆసనంచూపించి ఢిల్లీలో తన స్వగృహంలో - తన మిత్రునిగౌరవించినట్లుగానే గౌరవించి - అతనితో హృదయాహ్లాదకరమైన ప్రసంగం చేసింది. ఆమె మిత్రుడు దీనికి ఆనంద సంభరితుడైనాడు. మనోరంజకమైన సంభాషణ యే జరిగినదట ! ఆఉద్యోగి - ఆమెను పోలీసు అధికారులకు పట్టిఇచ్చుటకు బదులుగా - కీర్తించినాడు. ఒక అపూర్వ చరిత్రను సృష్టిస్తూవున్న వీరనారి సజీవ చరిత్రలో తానుకూడా ఒకపాత్రధారి కాగలిగిన తన అదృష్టానికి - భగవంతునికి వేయికృతజ్ఞతలు తెలిపాడు....అరుణ ఈ ప్రమాదాన్ని అతి చాకచక్యంగా దాటించుకొన్నది. తన మిత్రునికి ఒకగండాన్ని తప్పించింది.

మరియొకతూరి - ఆమె వుంటున్నప్రదేశానికి ప్రమాదం ముసురుతున్నదని - రహస్య పోలీస్‌లు దానిని పసికట్టినారని - తక్షణము ఆస్థలాన్ని వీడిపోవడం క్షేమకరమని - ఆమె సహచరులు ఆమెను హెచ్చరించారు, కాని ఎచ్చటికి పోవటము? కాస్తకాల వ్యవధిలో స్థలంమార్పు చేయడం ప్రచ్ఛన్నకురాలికి ఎట్లు సాధ్యమవుతుంది? చటుక్కున ఆమెకొక ఆలోచన తట్టింది. ఆనాటి ఉదయం పత్రికలో ఒక

ప్రకటన వున్నది. "ధనముచెల్లించగల యూరోపియనుకు ఎవరికైనా ఆతిథ్యమీయగల అవకాశం వున్నదని - అట్టి వారు వెంటనే ఈదిగువ చిరునామాకు వచ్చి విచారించ నగును" అనిప్రకటనలోని హంశాన్ని అరుణచూచుకొన్నది వెంటనే ఒక టాక్సీకారు ఎక్కి తృటిలో ఆ చిరునామాగల ఇంటికి చేరుకొన్నది కానిఆఇంటి యజమానురాలగుయూర పియన్ స్త్రీ - అరుణను చూచి ఆశ్చర్యపోయింది. అరుణ ముఖవళికను, భాషాచమర్కృతిని చూచి విస్మయపడి-ఐరోపి యునకే అతిధ్య మీయవలెనను తన నిర్ణయాన్ని మార్చు కొని - అరుణనులోనికి తీసికొనిపోయింది. ఆతిధ్య మిచ్చి, అరుణ అంతరంగిక మైత్రిని అలవరచుకొని ఆమె ఆనంద పరవశురాలయినది, అరుణ ఉనికికోసం అస్తవ్యస్త మైన పోలీసు రహస్యభటులు - వెనుకటి ప్రదేశంలో అరుణ లభించక - బుర్రలు గోకుకొన్నారు: మరియొక తూరి హతా సులై వెనుదిరిగి పోయారు, చేతిలో చిక్కించుకొని - వేళ్ళ సందునుండి జారవిడుచుకొన్న తమ అశక్తతకు, అప్రయో జకత్వానికి తలకాయలు వాల్చుకొన్నారు.

అవి బెంగాలు కరువురోజులు క్షుద్బాధాపిశాచి వంగ భూమిని పట్టి పల్లారుస్తున్నది. దీనజన సేవా పరతంత్రత అరుణను కూర్చొన నీయలేదు. వెంటనే వంగదేశంలో ప్రచ్ఛన్నంగానే తిరుగుతూ చేతనైనంతప్రజాసేవ చేస్తున్నది ప్రభుత్వరహస్య పోలీసులు ఈసంగతిని పసిపట్టారు. ఆమెను వెన్నంటి వెతుక నారంభించారు....దారుణ క్షామం? అన్నా ర్తులు పండుటాకులు రాలినట్లు నేలకొరిగి పోతున్నారు. పల్లె పట్టులతో ఈ ఘోరదృశ్యాలు మరీ దుర్భరమై వుం

టున్నాయి. చచ్చినవాని కాటికిచేర్చే దిక్కు లేదు. మృతకళే బరాలు, పీనుగులపెంట ఆసమీపంలోనే అరుణకు ఇరువురు పోలీసులు గుర్తుపట్టారు. శవాలకడ్డంబడి ఆమెపారిపోతూ వున్నట్లు ఆకను సంధ్యవేళ వారికి కనిపించిది. మరు క్షణం లోనే ఆమె అదృశ్యమైపోయింది. శవాల కడ్డుబడి పోవ డానికి ఆపోలీసు ద్వయానికి ధైర్యంచాలలేదు. మరి ఇద్దరిని తోడుతెచ్చుకొని శవాలన్నిటిని - ఆస్మశానభూమిని అర్ధరాత్రి వరకు కలయ వెదకి విసిగి వేసారి వెడలి పోయారు. చిత్రమేమంటే - అరుణ ఆశవాలలోనే - శవమట్లు పడుకొని వున్నది. కాని పోలీసు మృతనేత్రాలకామె కాన్పించలేదు—వారు ఇటు మళ్లిపోగానే - ఆమె అటులేచి వెళ్ళిపోయింది ! అబ్బ ! గుండెలు జలదరించే సంఘటన ! సాహసోపేత, ధైర్యఖిలసిత - అరుణ దినచర్యలు యువలోకానికి చైతన్య ధారకాలు ! శౌర్యస్ఫోరకాలు ! !

—ఇట్టివే మరెన్ని కథలున్నవో ! కథలు కల్లలని ప్రదీతి ! కాని ఇవి సజీవకథలు - మరికల్లలు కాలేవుకదా ?

అరుణాదేవికి - ఈ అజ్ఞాతవాసంలోఅగణితములైన ప్రమాదాలు తప్పనట్లే - ఆత్మీయమైన కష్టాలుకూడా ప్రాప్తి చినవి - ఆమె అజ్ఞాతంలో వుండగానే తల్లి మరణించింది. తుది ఘడియలలోనైనా గారాబు జ్యేష్ఠపుత్రిక అరుణ తన తల్లి సజ్జను లేకపోయింది. ఆమాతృ హృదయం ఎంత తల్లడిల్లినదో అరుణ ఎంతగా ఖేదపడినదో హృదయాలను చీల్చి చదువుకోవాలి.

నిర్బంధంలో వుండగానే - అసఫ్ అలీకి తీవ్రమైన వ్యాధి సోకింది. ప్రభుత్వం భీతికి అతణ్ణి వదిలి పెట్టింది.

అతడు ఢిల్లీకి చేరుకున్నాడు, కాని అతని గృహంలో అరుణ లేకపోవడం-అతనికి సర్వశూన్యమైనట్లుతోచింది. వ్యాధిగ్రస్తు డైన సతికి సేవచేయడానికి కూడా అరుణ నోచుకోలేదు.

అరుణ ఎచ్చటనున్నదో! ఏమైపోయినదో! అని అతడు కలగుండు పడినాడు "గతతొమ్మిది మాసాల నుండి నేను పూర్తిగా దుర్బలుడనై పోయాను, అనేక సారులు ప్రాణం పోయే పరిస్థితులు కూడా ఆసన్నమైనాయి. కాని అరుణనుచూడవలెనని నాహృదయం తహతహలాడిపోయింది మరల ఆమెను చూచే భాగ్యం ఈ జన్మలో నాకు లభించ దనుకొన్నాను....ఆమెవల్ల దేశానికి ప్రయోజనమూ, ప్రజ లకు చైతన్యము లభిస్తూవుంటే - ఎట్టి కష్టాలనైనా ఎదు ర్కొనడానికి నేను సంసిద్ధుడనేనని ధైర్యంగా చెప్పగల్గను" అంటూ అసఫ్ఆలీ చేసిన హృదయ విదారకరమై ప్రకటన - మానవాత్మను చలింప చేసింది. కావి ప్రభుత్వపాషాణహృద యంలో మాత్రం అది ఎట్టి చలనాన్ని అంతలో కలిగించ లేకపోయింది.

కాని-అల్మోరాజైలునుండి విడుదల అయిన వెంటనే జవహర్‌పండితుడు - అరుణ ధైర్యత్యాగాలను ప్రశంశిం చాడు. అరుణవంటి - అజ్ఞాతావలంబులకు తన ఆనంద భవ నంలో ఆశ్రయమివ్వ సంసిద్ధుడనై వున్నానని కూడా అతడు బహిరంగంగా ప్రకటించాడు. నెహ్రూపండితుని స్థైర్యవచ నాలకు ఆనంద పులకితుడై ఆసఫ్ఆలీ అతనిని అభినందిం చాడు. ఇరువురి పలుకులను విన్న ప్రజాహృదయం ఉత్తే జంతో ఉప్పొంగి పోయినది.

కాని - అసఫ్‌అలీ రోగపీడితుడై వుండగా అరుణ వచ్చినదని - తన హృదయసేవల నర్పించినదని మరికొన్ని వదంతులు....ఇదియేకాదు....అరుణ సిమ్లా సమావేశానికి కూడా హాజరైనదని, బొంబాయిలో కాంగ్రెసు సభలకున్ను వచ్చివెళ్ళినదని మరికొన్ని వృత్తాంతాలు వినరాక పోలేదు.

ఇందలి యదార్థ మేమైనప్పటికిని - అరుణ అజేయమైన ఒకచారిత్రకమూర్తివలె ప్రకాశించింది. అపూర్వమైన చరిత్రనే సృష్టించింది.

అరుణ, ఆమె సహచరులు - హింసాపూరితమైన ఈ విప్లవోద్యమం వలన బృహద్ఫలితాలను సాధించలేక పోయి వుండవచ్చు. కానీ - వారాచరించిన "గుండెలు తీసిన" పనులను మాత్రం చూచుకొని జాతీయ భారతీయులు గర్వపడగలరు ! అహింసాయుతంగా నేకాదు, హింసాపూరితంగా యుద్ధంచేయడానికి భారతీయులు సర్వ సమర్థులని - భారత జాతి ఏ సమయంలోనైనా ధీరశక్తిసమన్విత మని - ప్రభుత్వానికి ఈ రీత్యావారు బోధ పరచారు.

ఒక ప్రచ్ఛన నాయకత్వంలో - ఒక మహోద్యమం ఒకవిశాలమైన దేశమంతటా నడుస్తూవున్నప్పుడు-వదంతులు వేయి ముఖాల విస్తరించడం సహజం. అందునా - ప్రభుత్వం వార్తా నిరోధక విధానాన్ని అవలంభిస్తూ వుంటే - పుకారులు పుట్టెడు పుట్టుకొని రావడమున్ను వింతకాదు. ఈసత్యాన్ని ఈ ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం బాగాబలపరచింది - ఢిల్లీ ప్రభుత్వం వార్తలపై 'సెన్సారు' నిబంధనలనుఅమలు పరచడమేగాక - తనకు ప్రయోజనకరమైన పంథాలో ప్రచారంకూడా ప్రారంభించింది. ఆగష్టు తొమ్మిదవ తేదీసంఘట

పలనాటినుండి - భారతదేశంలో జరుగుతూవున్న విప్లవాన్ని గురించిన వార్తల నన్నిటిని ప్రభుత్వం త్రొక్కిపట్టింది. అట్లుత్రొక్కిపట్టి - ఉద్యమకారులను ప్రజలను, భయపెట్టవలెనని తాను విధిస్తూవున్నా సాముదాయక జరినామానాలకు కఠిన శిక్షలకు సంబంధించిన వార్తలను ప్రతిదినమూ ప్రచారంచేయసాగింది. యదార్థం తెలియక ఒక్కొక్కప్రదేశంలో ఒక్కొక్క విధమైన పుకారులు పొక్కిపోతూవుండెడివి.

ఏవేవో అల్లరులు జరుగుతూ వుండడము, ఎక్కడెక్కడో అలజడులు నడుస్తూ వుండడము మాత్రం నిత్యకృత్యంగా జరుగుతూవుంది. ఇంతటి విప్లవ సంఘటనలు సాగిపోతూవున్నా - వీటికి బాధ్యత వహించగల బహిరంగ నాయకత్వం ప్రజలకు గోచరించడంలేదు.

అరుణ ఆసఫ్‌ఆలీ, పట్వర్ధన్ మొదలైన వారు రహస్యోద్యమాన్ని నడుపుతూ వున్నట్లు ప్రభుత్వానికేకాదు, ప్రజలకు కూడా తెలియక పోలేదు. కాని వారు బహిరంగంగా కనబడకపోవడము, పత్రికలలో వారి చర్యలు గోచరించక పోవడము మొదలైన వాటివల్ల - వీరుబ్రతికి వున్నారో, లేదో అను సంశయం కూడా కొందరను కలత పెట్టింది. ఈసంశయాన్ని బలపరచు వదంతులుకూడా దేశంలో వ్యాపించి పోయినవి. విడుదల నందిన తరువాత ఆసఫ్ ఆలీ, జవహర్ పండితుడు అరుణను గురించి చేసిన ప్రకటనలు కూడా ఈ భీతికి మరింత దోహద మిచ్చినవి.

కాని - వారు సజీవులేఅయివున్నట్లు అచిరకాలంలోనే వారు వ్రాసిన బహిరంగ లేఖ వలన దృవపడినది.

అఖిలభారత కాంగ్రెసు సంఘం - అహింసనుగురించి నేతాజీ సుభాసుచంద్రబోస్‌ను గురించి - తన దృక్పథాన్నివివరిస్తూ - "కాంగ్రెసు అహింసా సిద్దాంతానికే అంకితమైఉన్నదని - హింసాయుతమైన చర్యలకు కాంగ్రెసు ఎన్నడును సమర్థించదని" ఒకతీర్మానాన్ని చేసి ప్రకటించినది.

కాని ఈ తీర్మానం అజ్ఞాతంగా వున్న కాంగ్రెసుసోషలిస్టు నాయకులకు మిక్కిలి హానికలిగించునదిగా వున్నందువల్ల - తమ ఆశయాన్నివివరిస్తూ అరుణఆసఫ్‌ఆలీ. అచ్యుత్ పట్వర్ధన్‌లు ఇరువురుకలసి - కాంగ్రెసుఅధ్యక్షుడు మౌలానా అబుల్‌కలామ్ అజాద్‌కు ఒకలేఖ వ్రాసినారు. ఆలేఖ ప్రకటితమైన వెంటనే - అరుణ,పట్వర్ధన్ మొదలైనవారు సజీవులై వున్నారని - ఎప్పుడో ఒకప్పుడు బహిరంగ రాజకీయాలలో వారు పాలొనగలరని - ప్రజలకు ధైర్యం కలిగినది - వారి మనో నిబ్బరాన్ని ధైర్య ప్రవర్తనలను కీర్తిస్తూ మూగ భారత ప్రజాహృదయం వారినిఅంతరాత్మలో ఆశీర్వదించింది

కాంగ్రెసు మతమైన "అహింసా సిద్ధాంతం" విషయమై కాంగ్రెసు అగ్రనాయకులకు, కాంగ్రెసులో వామపక్షీయులైన సోషలిస్టు నాయకులకు అభిప్రాయభేదాలు 1930 సంవత్సరంనాటినుండి బహుళంగా వుంటూనే వున్నవి.

సర్వాత్మనా అహింసాసిద్ధాంతాన్నే అనుష్ఠిస్తూ స్వాతంత్ర్య సమరాన్ని నడుపవలెనని కాంగ్రెసు ప్రబోధిస్తున్నది. కార్యరూపేణా ఆచరించి చూపుతున్నది. కాని - కాంగ్రెసు సోషలిస్టువర్గం "అహింస" తమకొక ఆదర్శంకాని వ్యావహారికంగా దానికి కొన్ని మినహాయింపులు తప్పని సరిగా వుంటవని, వుండవలెనని - వాదిస్తున్నది. ఈవాదాన్నివారు

ఆగస్టు విప్లవంలో తమ చర్యలద్వారా నిరూపించుకొన్నారు. హింసయో, అహింసయో - స్వాతంత్ర్య పోరాటంలోనిమగ్న మైవున్నప్పుడు తమకా ప్రసక్తియే లేదని వారు ఉద్ఘాటిస్తు న్నారు. బ్రిటిష్ సామ్రాజ్య దుష్టశక్తిని తుత్తునియలుజేయ డానికి ఎప్పటికి ఏది ఉచితమో దానిని మనః పూర్వకంగా ఆచరించడమే తమ ఆశయమని సోషలిస్టునాయక వర్గం చేయెత్తి చెబుతున్నదని; చేతలద్వారా చూపు చున్నది.

ఆధునిక స్వాతంత్ర్య సమరచరిత్రలు దొడ్డవైనపెక్కు ఘట్టాలు గతించిపోయినవి. కాని ఈ "హింస - అహింస" సమస్యలోమాత్రం కాంగ్రెసు అగ్రనాయకులకు సోషలిస్టు నాయకులకు నడుమ నిర్దుష్టమైన ఏకాభిప్రాయం కుదురలేదు. మరి - తమ ఆశయాలను కార్యరూపేణా ప్రయోగించి పరీ క్షించుకొన్న అరుణ - తదితర సోషలిస్టు నాయకులు - ఈ "హింస - అహింస" సిద్ధాంతాన్ని - పోరాటపు ఫంధాను. భారత స్వాతంత్ర్య సమస్యను మున్ముందు ఏవిధంగా నిర్వ హింపనున్నారో భావిచరిత్ర నిరూపించ వలసివున్నది.

అరుణ ఆసఫ్ఆలీ విప్లవవాదిని మాత్రమే కాదు - నేడు నిస్సందేహంగా ఆమెకాంగ్రెసు సోషలిస్టునాయకురాలు. ఈ నాయకత్వ స్వరూపం చక్కగా రూపొందడానికి ఈఅజ్ఞా తవాసం ఆమెకు అఖండంగా తోడ్పడింది. జయప్రకాష్ నారా యణ్, రామ్ మనోహర్ లోహియా, అచ్యుత్ పట్వర్ధన్ మొద లగు ధీవిశేషచతురులు, త్యాగశీలుర మైత్రి ఆమెకు లభించి నది. స్వతః ఆమెకువున్న సామ్యవాద భావాలు ఈ సామ్య వాద యువనాయకుల సహవాస ఫలితంగా రూపొందగలిగి నవి. దీనికి తోడు ఈ అజ్ఞాతవాస జీవితంలో సంఘాన్ని

సాంఘిక సమస్యలను, రాజకీయ వ్యవహారాలను ఆమెబాగా అవగతం చేసికొనడానికి అవకాశాలను కల్పించే పెక్కు అనుభవాలు అమెకు లభించినవి. ఆత్మపరిజ్ఞానానికి అనుభవమై నప్పుడు నిర్దుష్టమైన ఆశయాలు రూపొందడం సహజం. స్వర్ణపుష్పానికి తావి అబ్బినట్లుగా ఆ ఆశయాలు రాణించి, జగన్మోహనమై చెన్నొందగలవు.

అరుణ - అచ్యుత్ పట్వర్ధన్‌లు ఇరువురున్ను కలిసి అజ్ఞాతం నుండి రాష్ట్రపతికి జాబు వ్రాసిన ఇరువది దినాలకే భారత ప్రభుత్వం - అరుణపై మోపిన నేరాలనన్నిటిని రద్దుపరచి, ఆంక్షలను ఉపసంహరించుకొన్నది—

అరుణ - అజేయయై అఖండ విజయాలంకృతయై బహిరంగరాజకీయ ప్రపంచానికి అరుదెంచింది—

1942 ఆగస్టు 9 వ తేదీని ఆరంభమైన - ఆమె స్వయమారోపిత అజ్ఞాతవాసం - 1946 జనవరి 26వ తేదీతో పరిసమాప్తమైనది—

నలభై రెండు మాసముల కఠోరరహస్య జీవితం విజయ విభూషితంగా పర్యవసించింది—

అరుణ వెలుగులోకి వచ్చింది.

వేయివెలుగులతో ఆమె కీర్తి దేశవ్యాపితమైనది - వెంటనే పూజ్య బాపూజీ ఆశీర్వాదాలను పొందడానికి ఆమె సేవాగ్రామ్‌కు పరువెత్తింది.

1946 ఫిబ్రవరి పన్నెండవ తేదీ- సాయం సమయం. గాంధిజీ సమూహికప్రార్థనలను ముగించి, వాహ్యాళికి బయలు

దేరాడు. అంతవరకు గాంధీజీ కొరకై కాచుకొనివున్న అరుణ చటుక్కున ఆపితృమూర్తిని సమీపించి ఆయన చరణ సన్నిధిని వాలిపోయింది; గాంధీజీ పాదాలను గాఢంగా హత్తుకొన్నది. ఆమె నేత్రద్వయం నుంచి అశ్రువులు జలజలరాలి పోయాయి. ఆ సాయంసంధ్యాసమయానశశికిరణాలు ఆ అశ్రుబిందువులపైబడి మిణుకు మిణుకు మంటూ చెల్లాచెదరై పోయాయి. రుద్ధకంఠాన - అరుణ "బాపూ" అన్నది: "బేటీ" అంటూ ఆ ప్రేమమూర్తి అరుణ వీపుమీద తట్టి ఆమెను లేవనెత్తాడు. ఏదో ఉద్వేగంతో అరుణ గాంధీజీపై ఒరిగి పోయింది. ఆమె శిరస్సును గుండెలకు హత్తుకొని - గాంధీజీ ఆమెను ఆశీర్వదించాడు. ఇరువురు కొంతవడి మాట్లాడ లేకపోయారు.

ఒకరు అహింసామూర్తి ఒకరు విప్లవమూర్తి - నీరు, నిప్పు - సమావేశమైనవి - ఆధునిక భారతస్వాతంత్ర్య సమరజనకుడు; ఆజనకుని హస్తచాలనంలో పెరిగి పెద్ద అయిన విప్లవ వీరనారి - గాంధీజీ అరుణాదేవీల సమావేశం ఒక ఉజ్వలోదంతం. - కవికుమారుల కలాలకు ఆ కమనీయ దృశ్యం - ఒక కానుక !

వెంటనే అరుణ ఢిల్లీకి వెళ్ళి పతి దర్శనంకూడ చేసికొన్నది. అర్ధాంగి - రాజకీయ సహధర్మచారిణిగానే వుంటూ వుండిన అరుణ 'పూర్ణాంగి'యై నాటినుండి ఆసఫ్ ఆలీకి కీర్తి కాంతగా అలంకృత మైనది. దేశసేవనే పరమార్థంగా పెట్టుకొని - నిష్కళంక ప్రేమనే ఉపాస్యదేవతగా వరిం

చిన - ఆసఫ్ ఆలీ - అరుణను భార్యగా కలిగి ధన్యుడైనాడు; ధన్యాతి ధన్యుడైనాడు.

ఆ పూజ్యదంపతులు అమర జీవులు!



శ్రీమతి అరుణ

1857 - ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామములో - శత్రుబలిమిపై చీల్చి చెండాడిన వీరనారి - రాణి ఝాన్సీ లక్ష్మీబాయి—

1942 ద్వితీయ భారత స్వాతంత్ర్య సమరములో బ్రిటిష్‌వారి బలిమిని ఎదుర్కొన్న విప్లవ వీరనారి - శ్రీమతి అరుణ అసఫ్ ఆలీ—

అరుణ నవ భారత ఝాన్సీరాణి!

తప్త కాంచనమునకు కొత్త వన్నెలువలె - అజ్ఞాత వాస కష్టాల ఆటుపోటులకు నిల్చి, శత్రు శక్తిని గాలించి - అఖండమైన నవ్య శక్తులను సంతరించు కొన్న అరుణ, భారత యువలోకాన్ని ఇక నవ్యపథాన నడిపింపనున్నది!!

అరుణ తరుణభారత నాయికమణి!!!

జై హింద్!

